శ్రీరస్తు.

శ్రీ మహాగణేశాయనమః

# శ్రీసిద్ధేశ్వరీయము.



పూర్వము చంద్రగిరితాలూకా పాకాలపేట వాస్తవ్యులును
నిప్పుడు వేలూరు మిషన్ కాలేజి ప్రధానాంధ్రోపాధ్యాయులును నగు
ఆలూరు. వాసుదేవయ్యగారిచే
రచితము.



తం. తేవప్పెరుమాళ్లయ్యగారిచేఁ
పరిశోధితము.



THE PROGRESSIVE PRESS,
MADRAS.



 1911. [వెల 10 అణాలు.

# విజ్ఞాపనము.

మిత్రులారా?

పూర్వము "కాంభోజపురం" బనంబడి, పిదప "సురఘటపురం" బంచుఁ బేరొంది తర్వాత "కల్లుకడవపాత్రి" లని పిలువంబడి యిపుడు "కల్కడ" యనునామంబున నొకపురంబు కడపజిల్లావాయల్‌పాడు తాలూకాలోఁ బ్రసిద్ధినొంది యున్నది.

ఆ కల్కడయనుపురంబునకు నుత్తరభాగంబునందుండు భాస్కర నదిగట్టున మగధదేశాధిపతి యగుచంద్రగుప్తమహారాజు సిద్ధవట పురంబును దనకు రాజధానిఁ జేసికొని రాజ్యమేలుచుండి పుత్రులు లేకుండుటం జేసి శివయోగీంద్రుం డనుమహామునివలనఁ బంచాక్షరీమంత్ర రాజోపదేశంబు నొంది తత్ప్రభావంబుచేఁ గొన్నాళ్లకు నొకపుత్రికను గాంచి సత్యవతియని దానికి నామకరణం బొనరించె.

అంత నాసత్యవతికిఁ గొన్నిదినంబులు గడచినపిదప నా శివయోగీంద్రుం డొకసమయంబున "సారమంత్రం" బుపదేశింపఁ దన్మహిమ వలన నాకన్నియ గర్భంబుదాల్చె. అది తండ్రియెఱింగి దానికి హేతువడుగ నాసత్యవతి యేమియుం జెప్పక పోవుటం జేసి దానిసత్యంబుఁ బరిశీలింపఁ దలంచి యా నిండు చూలాలిని గొల్వుకూటంబునకుం బిలిపించి యొకసర్పంబును దెప్పించి దానిని శిరంబునఁ గుడుముట్టవలెఁ జేసి పెట్టుకొమ్మని చెప్పి యొకపచ్చికుండను దానిపై నిడుకొనఁ జేసి యందు సంపూర్ణంబుగఁ గల్లుదెప్పించి పోయించి "యీకుండ నెచ్చోటఁ గాని దింపక యిందుండి కాంభోజపురిమార్గంబునం బోయి సూర్యుఁ డస్తమింపకమునుపే యాపురిసమీపముననుండు భాస్కరనదిగట్టునడించి తివేని నీసత్యంబునిజంబు, లేకున్న నిన్నువధింతు"నని చెప్పి యట్లు సే

యింప, నాసత్యవతి యమ్మోయిం జేయ నంగీకరించి తనమనమ్మున నాసి ద్ధవటపురంబునం బ్రసిద్ధి గనియుండు సిద్ధేశ్వరుని వేడుచు నాకల్లుకుండ నెందేని దింపక జనకునానతిచొప్పున నాభాస్కరనదిగట్టున దించె. దాని భక్తికి నాసిద్ధేశ్వరుండా కల్లుకుండలో నుద్భవించి యా సత్యవతికిఁ బ్రస న్నుండై యాకన్యకామణి కభీష్టసిద్ధి గావించె ఆ కారణంబునఁ గల్లు కడవ ప్రోలని. కాంభోజపురంబునకు నామంబుగల్గె ఇప్పుడు కల్కడయం చుం జెప్పుటయేకాక కొందఱుజనులు "కల్కడకాంభోజపురం" బనియే వాడుచున్నారు. తక్కినకథ నీ చరిత్రముచదువ నెఱుంగఁబడును గదా! మఱియు నేనీవఱలో—జనయిత్రీయము, చంద్రసేనవిజయము, చంద్ర రేఖ, మఱికొన్ని చిన్న పుస్తకములను వచనకావ్యంబులుగ రచించితిని గాని పద్యకావ్యములను రచింపకుండుటం జేసి యిపు డీసిద్ధేశ్వరీయమను గ్రంథంబును కాశీపాకపురీమహాత్మ్య మనుగ్రంథంబును రచించితి. నాకుఁ బద్యకావ్యంబులందు నిది మొట్టమొదటి రచనయగుటం జేసి చదువు వారలు దమకుఁ దప్పులెందేని దోఁచిన పక్షమునఁ గృపతో నా కెఱింగింతురేని రెండవకూర్పున సవరించు కొనుచున్నాను.

ఇట్లు, విధేయుఁడు.

ఆలూరు-వాసుదేవయ్య.



శ్రీ ర స్తు.

శ్రీ గణేశాయనమః.

# శ్రీ సిద్ధేశ్వరీయము.

## ప్రథమాశ్వాసము.



సురగణసంసేవ్యుఁడు
శ్రీ సురఘటపురవరుండు శ్రీమత్కామా
క్షీసహితుఁడు సిద్ధేశుఁడు
శ్రీసమధికుఁ జేయుఁగాతఁ గృప నన్నెపుడున్. 1

మ. ప్రతిరోధించి దశాస్యుఁ డద్రిని గదల్పన్ వాని శిక్షింప కా
తత కారుణ్యముతోడఁ బ్రోచితివి శాంతస్వాంతుఁ డౌనీకు నే
గతి రుద్రుం డని యుగ్రుఁ డంచు బిరుదుల్ గల్గెన్ భళా యంచుఁదాఁ
బతితో మేలము లాడు శైలసుత నన్ బాలించి రక్షించుతన్. 2

ఉ. శ్రీయుతకల్పసాల మని చెప్పఁగ లోకులు చూచినారొ లే
దో యని యెంచి కోరికల నోజ నొసంగుచుఁ దద్ద్రుమంబు దా
నే యన వేంకటాద్రిపయి నిమ్ముల నిల్చె ననంగ నొప్పుశ్వ
శ్రేయసదాయకుండు హరి సేయుత నన్నుఁ గడుం గృతార్థుఁగాన్.

చ. నలువుగ మాయ వన్నిమతి నన్ను మొఱఁగి మెఱుంగుబోండ్ల లా
తులవలలందుఁ జిక్కి ననుఁ దోయరుహాక్షుఁ డుపేక్ష సేయ నా
వల నెటు లోర్తు నంచుఁ బతి వక్షముఁ బాయక నిల్చెనో యనం
జెలఁగు రమావధూటి దయ సేయుత నా కనిశంబు సంపదల్. 4

మ. అలశైలాత్మజ యాత్మవల్లభుని నఽర్ధాంగీకృతుం జేసెఁ దాఁ
జెలువౌ నాథునియొమ్ముఁ ద్రొక్కి నిలిచెన్ ఽ శ్రీకాంత నాకాంత యి
మ్ముల నామాటనె యుండుఁగాత మని యాఽపూఁబోఁడి నెమ్మోమ్ములం
దెలమిం దాల్చెనొ నాఁ దనర్చు నలవాఽణీశుండు నన్ బ్రోచుతన్.

ఉ. సంచితరాగమాధురి పొఽసంగదు నీ కిటు నాకు నీడుగా
నం చొకచేత నంకమున ఽ కల్లన తాఱిచి యొండుచేతితో
నించినవేడ్క నంటుచును ఽ నేర్పెడినో యన వీణెఁ బట్టి వా
యించెడువాణి నాకు నలఽరించుఁ గృతి మంజుకవిత్వవైఖరుల్. 6

శా. శ్రీలాలిత్యగుణాతిగణ్య యగునాఽ రీదేవి చన్నిచ్చుచో
నోలిం దానొకచన్నుఁ ద్రావుచును వేఽఱొక్కంటఁ గుండాగ్రమున్
లీలన్ రాయుచుఁ దల్లి ముద్దిడుచు లాఽలింపంగ నింపారునా
బాలాగ్రేసరుఁ డావినాయకుఁడు నన్ ఽ బాలించు నశ్రాంతమున్.

చ. అలర మదిష్టదేవతల ఽ నార్తశరణ్యులఁ జారుపుణ్యరూ
పుల భవరోగహారిపద ఽ పద్మమహామహభాసమానులన్
సలలితసౌఖ్యదాయినులఁ ఽ జండవిపత్ఫణిబృందబర్హికాం
తల నలసప్తమాతల నెఽదం దలపోయుదు నిష్టసిద్ధికిన్. 8

చ. సకలకళాప్రవీణుఁడు ప్రశఽస్తగుణాఢ్యుఁడు తత్త్వమార్గబో
ధకుఁడు యశోవిశాలుఁడు నుఽదారమనస్కుఁడు వేదమార్గదీ
పకుఁడు మదీయచిత్తవర ఽ పద్మదివాకరుఁ డైనయాత్మదే
శికునిపదారవిందములఁ ఽ జిత్తమునన్ భజియింతు నెంతయున్. 9

## పురాతనకవీంద్రగుణకీర్తనము.

మ. తగ వైకుంఠమునందు నుండి యెలమిం ఽ దా మున్ను రామాహ్వయం
బగుదివ్యామృతబిందు వొందు రహిమైఽ నానారదుం డీయ నిం
పుగ దానిం గొని దివ్యరామచరితాంఽభోరాశిఁ గావించియున్
మిగులన్ మించుగుణాతిరేకి యగు వాఽల్మీకిం బ్రశంసించెదన్. 10

తే. ఎలమి వేదార్థముఁ బురాణములు జగానఁ
దనరఁజేసి మహావిష్ణు వనఁగ నెవఁడు
భూరివిఖ్యాతిఁ గాంచె నమ్మునివరేణ్యుఁ
గోర్కి నిండార నాత్మలోఁ గొలుఁతు నెపుడు. 11

సీ. ప్రకటకవీంద్ర కైరవరాజిరాకాసు
ధాభాసుఁ డగుకాళిదాసు నెంచి
ప్రథితసుదృగ్జాలపద్మాకరోదార
రవి యైరహించుభారవి నుతించి
ప్రతివాదిజనచిత్తబాధైకహేతునిశాత
బాణుఁ డైరాణించు బాణుఁ దలఁచి
కుకవికాలోరగకుటిలతాహారిమ
యూరుఁ డైమించుమయూరుఁ గొలిచి
పండితకలాసముద్దండి దండి కెఱఁగి
భూరివాగ్భూతి యగుభవభూతిఁ బొగడి
మహితకావ్యార్థపేటి యామాఘుఁ దలఁచి
ప్రౌఢరచనానిబంధు సుబంధు నెంచి. 12

తే. శ్రీమహాభారతంబు నాంధ్రీకరించి
యనుపమానకవిత్వవిఖ్యాతిఁ గాంచి
నట్టినన్నయఁ దిక్కన యజ్వ శంభు
దాసకవిపుంగవుని నాత్మఁ దనరఁ దలఁచి. 13

కుకవినిరాకరణము.

చ. శుకములు మంచిపండ్లు దిని సొంపగుపల్కులఁ గుల్కునట్లుగా
సుకవులు నాప్రబంధమునఁ జూచిననొప్పుల మెచ్చి పల్కరే
బకములు మీలగుంపు దిని పల్కవె కర్ణకఠోరభంగిగాఁ
గుకవులు నట్ల తప్పు లని కూయరె దాన గుణంబు వ్రోవునే. 14

తే. సకలశాస్త్రంబు లెల్లైనఁ జదువ వచ్చుఁ
గాని కవితాచమత్కృతిగల్లు టరుదు

కలిగి కావ్యము రచియించు కవికి ఘనత
తనరకుండునె సుకవు లేమనినఁ గాని. 15

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవీంద్రగుణకీర్తనంబును గుకవినిరాకరణంబునుం జేసి మద్వంశావతారం బభివర్ణించెద.

వంశానుక్రమణిక.

సీ. శ్రీమదాలూరువం శామలాంభోరాశి
పూర్ణిమాచంద్రుండు బుధనుతుండు
కాశ్యపగోత్రసం కలితుఁ డాపస్తంబ
సూత్రుఁడు సుగుణసం శోభితుండు
వెంకయార్యునకు సాధ్వీమణి సుబ్బమాం
బకు దత్తపుత్త్రుఁ డా ప్తజనయుతుఁడు
ప్రథితజ్యోతిశ్శాస్త్ర పారంగతుండు పం
చాక్షరీమంత్రర హస్యవిదుఁడు
మహితకీర్తివిహారుండు మానధనుఁడు
సత్యసంధుండు నయవిచక్షణుఁడు ధర్మ
వర్ధనుఁడు రామకృష్ణదై వజ్ఞుఁ డవనిఁ
బరిఢవిల్లెడుపాకాల పురమునందు.
[శుఁడు

సీ. వఱలుకంభమువంశ వారాశిచంద్రుఁడు, కౌండిన్యగోత్రసం కలితయ
సంగీతవిద్యావి శారదుం డుత్తమ, చరితుండు సజ్జన సన్నుతుండు
ప్రవిమలాత్ముఁడగును బ్రహ్మణ్యవిబుధుండు, పార్వతి కైవడిఁ బరఁగునట్టి
సుబ్బమయన్నప్రియ సుదతిలలామగ, ర్భంబునఁ గాంచినఁ బడఁతిఁ గృష్ణ
మాంబఁ గడుప్రీతిఁ దాఁ బెండ్లి యాడి యామె
యందుఁ బుత్త్రిల నేవురఁ బొంది కలిమి
కిరవుగా నుండుపాల్కుల పురమునందుఁ
దనరుచుండెను నంత నా దంపతులకు. 18

తే. ధర్మనిష్ఠితచిత్తులు దారకీర్తు
లాత్మజన్ములు గలిగి రా యలఘుసుగుణ

భాసమానుల కనుజుండ § వాసుదేవ
నామకుండను విబుధజ § నప్రియుండ. 19

తే. ఏ నొకదినంబు నాత్మలో § నిద్ధరిత్రి
నేది శాశ్వత మగుకార్య § మేదిహితము
కల్మషంబుల నేనిచే § గ్రాఁచఁ గల్గుఁ
దలఁపఁగా నాకు నని యిట్లు § దలఁచు చుండ. 20

వ. సప్తసంతానంబులయందుఁ గృతి శాశ్వతం బంచు నార్యులు వక్కా-
ణించినవచనం బాత్మకుం దోఁప నంత సురాఘుటపురీశ్వరుం డగు
శ్రీసిద్ధేశ్వరస్వామిచారిత్రం బంతయుం బద్యకావ్యంబుగ వ్రాయం
బూని యాత్మగతంబున. 21

క. శ్రీసురఘుటపురవరుఁ డగు, శ్రీసిద్ధేశ్వరుఁడు దప్పఁ § బృధ్వి మ తెవ్వాఁ
డీసుకృతికన్యకుం బతి, భాసురముగ నని తలంచి § ప్రమదం బారన్.

## షష్ఠ్యంతములు.

క. శ్రీసర్వజ్ఞునకుం గరు, ణాసాగరపూర్ణచంద్రు § నకుఁ బ్రణవగృహా
వాసునకుఁ శ్రీకామా, క్షీసహితున కనఘునకును § సిద్ధేశునకున్.

క. శ్రీసుభగచరిత్రునకుఁ, భాసురధవళాంబుజునకును § భవ్యాత్మునకుఁ
శ్రీసురఘుటపురవరునకు, శ్రీసర్వవిభూషణునకు § సిద్ధేశునకున్. 24

వ. సమర్పణంబుగా నాయొనర్పం బూనినసిద్ధేశ్వరీయ మనుమహాప్రబం
ధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 25

## నైమిశారణ్యవర్ణనము.

సీ. సత్యలోకముఁ బోలె § శారదాశాండిల్య
కపిలగాలవకౌశి § కవరు లెసఁగ
వైకుంఠమును బోలె § వైజయంతీశుక
మాధవీనారద § మదను లెసఁగఁ

కైలాసమును బోలె ఘనవృషకుంభచం
ద్రార్కహైమవతీ గుహాదు లెసఁగ
నింద్రలోకము వ్రాలె నింద్రాణిసుమనోవ
రైరావతసురభి శక్రాదు లెసఁగ
భూరివిఖ్యాతిఁ గాంచును భూతలమున
మునివరేణ్యులవరతపోధనగృహముగఁ
గలుషవారాశితరణము గా విశాల
పుణ్యదేశము నైమిశారణ్య మరయ. 26

వ. అప్పుణ్యారణ్యంబునఁ బరిశుభ్రతరంగగంగాప్రపూర్ణం బగుగోమతీతరంగిణీకూలంబున ద్వాదశవార్షికసత్రయాగంబు ప్రవర్తిల్లుచు నుండ శ్రీశౌనకాదిమహామునులు రోమహర్షణపుత్త్రు బాదరాయణిప్రియశిష్యుఁ బౌరాణికు సూత్యాహసంభవు సూతు నర్చించి యిట్లనిరి నిఖిలపురాణవ్యాఖ్యానవిఖ్యాతుండ వైనయోసూతా! పంచాశత్ఖండమండితంబును బహుసంహితాసమాకీర్ణంబును నగు స్కాందపురాణరత్నంబునందలియగస్త్యసంహితయందుఁ జెప్పంబడినహాలాస్యనాథునిచతుష్షష్టివిలాసంబు లన్నియు సీవలన నాకర్ణించి పరమానందంబు నొందితిమికావున నిపు డెద్దియేని యొక పుణ్యచరిత్రంబు గర్ణరసాయనంబుగ నుడువు మని ప్రార్థింప నప్పౌరాణికుం డాదరాయత్తచిత్తుం డై సావధాను లై వినుం డని యిట్లనియె. 27

క. మునులారా! శ్రీశైలం,బునకుఁ దక్షిణముగాను ముక్తిప్రద మై
ఘనకల్మషహర మై ధరఁ,దనరారుఁ బినాకినియనఁ దనరెడునది దాన్.

వ. ఆనదీతీరంబున. 29

### సిద్ధవటపురవర్ణనము.

సీ. దేవతాజనవిహారావాసభాసుర, బహువిధప్రాకారపరివృతంబు
గోపురవిలసితగోపురసంకాశ, రమణీయగోపురభ్రాజితంబు

రాజతాహార్యరా రాజితశృంగోప, మానమానితసుధా మహితసౌధ
మజితాతపత్రస ద్ధ్వజసముత్తుంగశ, తాంగమాతంగ సమంచితంబు

ఆజి భార్గవు గెల్చుభ టాళిపట్టు
సకలధనధాన్యసంచయ సమధికంబు
ఖ్యాత మహాజయలక్ష్మికిఁ గాఁపురంబు
పరమసుఖప్రదంబు శ్రీసిద్ధ వటపురంబు. 30

తే. మఱియు భూదేవి నవరత్నమయవిభూష
ణావళిం దాల్చి తనచెలు వారఁ జూచు
కొనఁగఁ జేఁ గొన్నదర్పణం బనఁగఁ బుడమిఁ
దనరు నాపురి శృంగార మునకు నిధిగఁ. 31

సీ. ఆపట్టణంబునం దమరేజ్యునకునైన
శంక దీర్చెడువిప్ర సంఘ మలరు
నమరేంద్రునకునైన నాజిఁ దోడ్పడి శత్రు
జయ మొనర్చెడురాజ సంఘ మలరు
ధనధాన్యసంపన్న త వహించి ధనదుని
సరకు సేయనివైశ్య సంఘ మలరుఁ
బాఁడిపంటలకు మా పాటి లే రని సంత
సంపడువరశూద్ర సంఘ మలరు
నృత్తగీతంబులందును నేర్పు మీఱి
ఖేచరాంగనలను బిల్చి గేలి సల్పు
సరసగుణయుతగణికాని కరము నలరు
దాని వర్ణింప నేరికిఁ దరమె జగతి. 32

సీ. క్షితి నాపురీశుఁడా శ్రితకోటిమందారుఁ
డభియాతికోటికా లాంతకుండు
కుజనబలాహక ప్రజసమీరుండు స
జ్జనపుష్పసంచయ షట్పదుండు

సన్మిత్రకోట్యంబుజవనైకమిత్రుండు
బాంధవకుముదక్షపాకరుండు
బుధలోకచాతకాంబుధరుండు మానిత
మహితవిద్యాధనమందిరుండు
ప్రమదభటకోటిపరివృతప్రాభవుండు
నైనచంద్రాన్వయాబ్ధిసుధాకరుండు
శమదమాది గుణోపేతుఁ డమలయశుఁడు
చంద్రగుప్తమహీపాలచంద్రముఁడు. 33

సీ. అతనిపాలనమునందవనీసురేంద్రులఁ
గ్రూరులై దూషించువారు లేరు
తాలుమాలుగఁ దల్లిదండ్రుల నిందించి
కొట్టెడువారు కన్గొన్న లేరు
విత్తంబుఁ గొని కులవృత్తిని విడి తొత్తు
వృత్తికిఁ జనెడుదుఃస్త్రీలు లేరు
జారచోరులు దురాచారాన్వితులు లేరు
వంచనతో బొంకువారు లేరు
ధనముఁ గొని కూఁతు నొసఁగుపాతకులు లేరు
జనులబ్రదుకులు చెఱుచుదుర్జనులు లేరు
దైవవిత్తాపహారులు దలఁప లేరు
గురుజనంబుల దూఱెడునరులు లేరు. 34

తే. చంద్రగుప్తనరేంద్రుఁ డీచాడ్పున మహి
సకలసామ్రాజ్య విభవాతిశయము నొంది
జనులు మనరాజు శ్రీరాముఁ డనుచుఁ బొగడ
నెలమి ధర్మంబుగా రాజ్య మేలుచుండె. 35

వ. ఇట్లుండి యొకనాఁ డారాజేంద్రుండు సుబుద్ధి యనుమంత్రిశేఖరుం జూచి "రేపరుణోదయంబున నాఖేటవిహారార్థముగ నరణ్యంబునకుం బోవలయుఁ దగుప్రయత్నంబు సేయింపు మనవుడు నాయమాత్యుండు మహాప్రసాదం బని మృగయుల రావించి ఱేనియానతి నెఱింగించె.

తే. అంత నవ్వార లరుణోదయంబు గాఁగఁ
బ్రమద మారంగఁ దగునాయుధములు వట్టి
వెంట జాగిలములు రాఁగ వెడలి నృపుని
నగరిముంగిట నిల్చిరాసతి మెలర్ప. 37

చంద్రగుప్తుఁడు వేఁటకుఁ బోవుట.

సీ. అప్పు డాచంద్రగుప్తావనీశుఁ డలంకృ
తిం గలమహితశాతాంగమునను
మంత్రియుం దాను సమ్మదలీలమై నెక్కి
పురజనంబులు వేడ్కఁబొంది సూడఁ
బరిజనంబులు వెంటఁబలు తెఱంగులు వల్కు
కలకలారావముల్ గడలుకొనఁగ
మృగయులెల్లరుఁ దమమగతనంబులు సెప్పు
కొంచు ముందట గుంపుగూడి నడవ
నిశితశరఖడ్గకాంతులు దిశల వెలుఁగ
సమదగజబృంహితాశ్వహేషలు సెలంగ
వివిధవాద్యంబు లాగి వియద్వీథి నొలయ
వెడలి రతిముఱి వేఁటాడ విపినమునకు. 38

వ. ఇట్లరిగి యడవిసమీపంబున నొక్కెడ నరదంబు డిగ్గి తురగంబు
లనుఁ గొందఱిఁ బరిజనంబుల నచ్చో నిల్పి మృగయులతోఁ గూడి
వనాంతంబునం బ్రవేశించి. 39

సీ. కొందఱు మృగయులు కొండలకోనలఁ
జేరి మెకంబులఁ జెదరి పాఱు
నట్లు భయప్రదం బగువాద్యములు సేయఁ
బొదలందు గవులందు నిదురఁబోవు
శార్దూలభల్లూక సమదవరాహఖ
డ్గలులాయసంఘము నలువలంకు

లకుఁ బాఱఁ గ్రాంచి త ʃ లంపార భూపాలుఁ
డతివిక్రమము మెఱయంగ నిశిత
ఖడ్గమును బూని పుండరీ ʃ కముల నఱకి
మహిషభల్లూకముల రూపు ʃ మాపి క్రోడ
ఖడ్గమృగములఁ జెండాడి ʃ కరుల గిరుల
కరణి నేలకుఁ బడఁగొట్టి ʃ కను మొఱంగి. 39

క. నలుదెసలఁ బాఱు పెఱమెక
ముల వలలం జిక్కువడఁగ ʃ మోఁదుచు నిటు భూ
తలనాథుఁడు వేఁటాడుచు
నలసి జలంబులను గ్రోల ʃ నాగహనములోన్. 40

వ. తా నొక్కఁడ పినాకినీనదికిం జని నీ రాని వచ్చుచు నుత్తరభాగం
బునుం జూడ నయ్యెడ. 41

చంద్రగుప్తుఁడు సిద్ధగణమును గనుట.

క. ఉరుతరశాఖాగ్రము లం
బర మంటుచు మూలచయము ʃ పాతాళమునం
బరఁగుచు సహస్రశిరముల
నరయఁగ నయ్యాదిపురుషుఁ ʃ డన నొకవటమున్. 42

క. తనరెడు నవ్వటవృక్షం
బును జూడఁ దలంచి యటకు ʃ ముదమునఁ జని దాఁ
గనుఁగొనియె దానిక్రిందను
ఘనకల్మషవిజితసిద్ధ ʃ గణమును నరవిన్. 43

వ. పరమభక్తి నాసిద్ధగణంబునకు సాష్టాంగదండప్రణామంబు లాచరిం
చి యొక్కెడ నిలువంబడి ముకుళితహస్తుం డై తనమనంబున. 44

క. ఇమ్మునిపుంగవు లుండువ, నమ్మున కే నేల పరిజ ʃ నంబులతో మో
దమ్మున వేఁటకు రావలె, నిమ్మహనీయులును మనల ʃ నేమెంతురొకో.

వ. మఱియుఁ దొల్లి విశ్వామిత్రునియాశ్రమంబునకు హరిశ్చంద్రుండు మృగయావిహారార్థంబుగఁ జని యమ్మునివర్యువలనఁ గడుం గడగండ్లు వడియెఁ దద్విధంబున నా కెట్టియిడుములు గల్గింతురో యిఁ కేమి సేయువాఁడ నని భయాకులితచిత్తుం డై నిలువంబడియుండ నాచంద్రగుప్తుం గని సిద్ధగణంబులందు శివయోగీంద్రుఁ డిట్లనియె. 46

క. ఈలీల విచారంపడ, నేలా రాజేంద్ర! రాజు § లెవ్వరికైనన్
మే లొందెడుకార్యం బను, కూలంబొనరింప దానఁ § గోపము గలదే.

చ. అని నరనాథచంద్రునిఁ బ్రి § యంబున దగ్గఱఁ బిల్చి యివ్విధం
బునఁ దగఁ బల్కె నోమనుజ § పుంగవ! నీవు భయంబు మాని న
న్గనుఁగొన వచ్చుచుండు భవ § కల్మషవార్ధిఁ దరించుమంత్ర మిం
పొనరఁగ నీకుఁ జెప్పెదను § బుణ్యదినంబున నద్ది నీ కొగిన్. 48

తే. సమరకేళి జయం బిచ్చు § సఖులఁ గూర్చు
సకలసంపద లొడఁగూర్చు § శాంతి నిచ్చుఁ
బుణ్యనిధిఁ జేర్చు సత్కీర్తి § పొసఁగఁ దెచ్చు
దానిమహిమను గొనియాడఁ § దరమె జగతి. 49

వ. కావున నీనిజచిత్తవృత్తి నెఱింగితి నమ్మంత్రరాజం బొకతఱి నుపదేశింతు నిపు డొకపుణ్యకార్యంబు సేయుము తొల్లి మహాసిద్ధులు నిర్మించిన సిద్ధేశ్వరదేవాగారం బీపినాకినీనదీకూలంబున నున్నది. అయ్యది శిథిలం బగుటం జేసి పునరుద్ధారణంబు సేయు మనుడుఁ జంద్రగుప్తనరేంద్రుఁ డమ్మెయిం జేయింతు నని భక్తిమై నాయోగివరున కిట్లనియె. 50

క. సద్ధర్మనిలయ! యీపురి, కిద్ధాత్రీతలమునందు § నేహేతువుచే
సిద్ధవటం బను పేరు ప్ర, సిద్ధంబయ్యెను ముదమున § జెప్పుమ నాకున్.

తే. అనిన నాయోగివర్యుఁ డి§ట్లనియెఁ బ్రీతి
వటతరువుక్రింద శ్రీసిద్ధ § వరగణంబు
తపముచేసెడుకతన ని§ద్ధాత్రియందు
సిద్ధవటపుర మనఁగఁ బ్ర§సిద్ధ మయ్యె. 52

మ. అని యాయోగివరుండు సెప్ప నరనాథాగ్రేసరుం డమ్మహా [నే
మునివర్యుం గొనియాడి మ్రొక్కిలిడి యామోదంబుమైఁ బోదు
యనుచుం వీడ్కొనఁ బ్రీతి నాతఁడును భూపాధీశుఁ గొమ్మంచు దీ
వెన లియ్యం గొని వచ్చి వేఁటయెడకుస్వమంత్రిశార్దూలుతోన్.

వ. సిద్ధులం గాంచినసంగతి నుడివి యిచ్చో వేఁటాడఁ దగ దంచుఁ దా
నందఱుం దోడ్కొనిపురంబుం జేరి మృగయులకుం బసదనం బొసంగి
వీడ్కొలిపి యంతిపురంబునకుం జని మజ్జనభోజనాదికృత్యంబులు
దీర్చికొని సుఖంబుండుసమయంబున భార్యాలలామం బగుపుణ్యవతీ
దేవికిం దాఁ జూచినమునులవృత్తాంతం బంతయు నెఱింగింప నాకర్ణించి
విస్మయపరీతచిత్తయై యాపడఁతి ప్రియవల్లభునకు నిట్లనియె. 54

తే. నాకు నాయోగిజనదర్శనంబు సేయు
భాగ్య మెప్పుడు గల్గును బాణినాథ
మనకు వారిసుదర్శనంబును లభించు
టరుదు గద యంచుఁ బల్కినఁ దరుణిఁ గాంచి. 55

క. వనితా! యాయోగిగణం
బును జూడఁగ వచ్చు వారి ముదలం గొనినాఁ
డను నొకదినమున నచటికిఁ
జని వారిసుదర్శనంబు సల్పుద మెసఁగన్. 56

తే. అని ముదం బారఁ జెప్పి తానంత మదిని
సిద్ధవర్యుండు సంప్రీతిఁ జెప్పినట్టి
సిద్ధలింగేశ్వరాలయ మిద్ధరిత్రి
వెలయఁ గట్టింపవలె నంచుఁ దలఁచి యపుడు. 57

వ. సుబుద్ధి యనుమంత్రివర్యుని రావించి యాలయనిర్మాణంబునకు శిల్పి
సత్తముల రావింపు మనుడు నతం డట్లు రావించి చేసి కెఱింగింప
నతం డాశిల్పులను శిథిలం బైయుండుదేవాగారంబునకుం దోడ్కొని
పోయి యత్యంతమనోజ్ఞంబుగ దీని నిర్మింపుఁ డని యానతియ్య వార
లు మహాప్రసాదం బని. 58

ఆ. పటుతరోజ్జ్వలోరుక ప్రాకారపంక్తులు
బహువిచిత్రమండపములు వివిధ
రత్నరచితకలశ రాజరాజితగోపు
రములు గర్భమందిరములగములు. 59

క. విరచించిరి కైలాసము, కరణిం జెలువార భూమికాంతుం డంతన్
ధరణీనిర్జరవరులను, సరగున రావించి మ్రొక్కి సవినయమతితోన్.

వ. ప్రశస్తం బగునొకశుభముహూర్తంబు చూడుం డందు శ్రీసిద్ధలింగే శ్వరుం బ్రతిష్ఠింపవలయు ననిన వా రొకలగ్నంబును బరిశోధించి చెప్ప నాలగ్నంబునందు రాజేంద్రుండు సకలవస్తుసముదాయంబు దెప్పించి తాను బుణ్యవతీసమేతుం డై నిత్యకృత్యంబులు నిర్వర్తించి కొని భూసురనారీరత్నంబులను సకలవేదశాస్త్రపారంగతు లగు విప్రేంద్రులను దోడ్కొని తదాలయంబునకు మంగళవాద్యవిశే షంబులతోం జని యర్చించుటకు నిర్ణయించినధరణీసుపర్వుల ము న్నిడుకొని నాసిద్ధలింగంబును నమకచమకమహాన్యాసాదిమంత్రంబు లచే నభిషేకంబు గావించి వేదమంత్రఘోషంబులు సెలంగ వివిధ వాద్యాభిరవంబులు మిన్నుముట్ట నాసిద్ధలింగంబును బ్రతిష్ఠించి భూ సురబృందంబునకుం గనకవస్తువాహనాంబరాదులచే సన్మానింపం బంచి శిల్పోత్తములకు వలసినపసదనంబు లొసంగి నాంటంగోలె నా స్వామికి నృత్తగీతవాద్యములతో నిత్యోత్సవంబులు సేయించుచుం దద్భక్తి మనంబున నెలకొల్పి రాజ్యంబు పాలించుచు నుండ నొక్క నాండు భార్యాలలామం బగుపుణ్యవతీదేవి డగ్గఱకు నేతెంచి కడుం జింత ని ట్లనియె. 61

పుణ్యవతీదేవి సంతానహీనతకు భర్తతోం జింతించుట.

సీ. వల్లభా! వినుము భూవలయంబునందుం బు
త్త్రిణ లోకాన్ జయతి యనుశ్రుతిని
బుధులు వక్కాణింపం బొనంగ వింటిని గొంత
పుత్త్రులు లేనట్టి భోగ మేల?

గజతురంగము లేల ? కనకసౌధము లేల ?
రథము లేల?మఱియీ రాజ్య మేల ?
పుత్త్రిభాగ్యం బుండి భూరిసంపద లున్న
దానికంటె సుఖంబు ధరణిఁ గలదె ?
కాన ననపత్యదోషంబు కంటె జగతి
పాప మొక్కండు గలదె? భూపాలచంద్ర !
మోక్షధన మెట్లు లభియించు? మొనసి దీని
కిపుడు పెద్దల రావించి యెఱుఁగఁ జేయు. 62

క. ధన మెంత నీకుఁ గల దని
జను లడుగరు నీకుఁ బుత్త్రిసంపద గలదే
యని యడుగుదు రాత్మేశ్వర
ధన ముండిన నేమి పుత్త్రిధనసదృశంబే. 63

క. తనయులు గలపుణ్యాత్ములు
ధనికులు గా కున్న ధనము తనయులు గారే!
ధన మున్నఁ గులము పెరుఁగునె ?
తనయులు గల రేని కులము ధాత్రిం బెరుఁగున్. 64

వ. మఱియుం దగినసుందరాలంకారంబులఁ బుత్త్రిల నలంకరించి వా
రాడుముచ్చటలం గన్నులపండువుగఁ జూచి సంతసంపదుపుణ్యాంగ
నలకన్నులు కన్నులు వారిం గన్న దేహమే దేహము నా కట్టిపున్నె
ము లభించునే యంచు వెండియు ని ట్లనియె. 65

సీ. వాసరేశుఁడు లేని వాసరంబుసరణి
రేదారి లేనట్టి రేయిపగిదిఁ
గవిపుంగవులు లేని ఘనరాజసభచోట
దీపంబు లేనిమం దిరమురీతి
ఫలపుష్పములు లేని పాదపంబుగతిని
వరపికంబులు లేని వనముభంగి

హంసలు లేనిపద్మాకరంబునక్రియఁ
  బ్రణవంబు లేనిమంత్రంబుభాతి
సలిలములు లేనిమఱిపెద్ద సరసిమాడ్కి
నెఱి హిరణ్యము లేనిమానికములీల
సత్సుగంధంబు లేనివాసంతికరణి
నెంత యుండిన నేమి భూకాంత మనకు. 66

మ. అకటా! పుత్త్రులు లేక యుండుఁ డను చయ్యంభోజగర్భుండు వే
ఱొకకార్యం బొనరింపకుండ నొసటన్ యోచించి యీరీతి నిం
చుక కారుణ్యము లేక వ్రాసెఁ దగ నంచుం బల్కుచున్నట్టిభా
ర్యకుఁ జింతింపకు మంచు ని ట్లనియె నాగరాజేంద్రుఁ డొప్పారఁగన్.

క. మును చేసికొన్నకర్మం
బనుభోగింపంగవలయు నది బ్రహ్మకు నై
నను వదలదు దీనికి యో
చన సేయఁగఁ బుత్త్రఫలము సమకొనఁ గలదే. 68

తే. జలధిఁ గలశంబు ముంచి యాజలధి నుండు
జలము నంతయుఁ గొంపోవఁ దలఁచి తేని
కలశమును బట్టినంతకు జలము వచ్చు
గాన మనభాగ్య మధికంబు గల్గఁ గలదె. 69

తే. అయిన నిప్పుడు పెద్దల నడుగుకొఱకు
గరిమరావింతు నని మంత్రిఁ గాంచి యిపుడు
మహితయశు లగుదైవజ్ఞ మణులఁ బ్రీతిఁ
దనర రావింపు మనవుడుఁ దత్క్షణంబ. 70

వ. వార్తాంతికశిఖామణు లగువిభావస సుచిత్త యజ్ఞదత్తు లనుబల్యాంకి
కలంపి రావించి యుచితాసనంబుల నాసీనులం జేసి రాజున కెఱిం
గింప నతండు పుణ్యవతీసమేతుం డై ఫలపుష్పతాంబూలంబుల నొక
పసిండిపళ్లెరంబున నిడికొని యాజ్యోతిషికవరిష్ఠుల ముం దిడి వారికి
దండప్రణామంబు లాచరించి తనజన్మపత్త్రిక యొసంగి యి ట్లనియె.

ఆ. బుధవరేణ్యులార! పుత్త్రు లింతకు మాకుఁ
గల్గ కుండుటకును గారణంబు
దెలియ కున్న దదియుఁ దెల్పుఁడు యోచించి
దాఁచిపెట్టకుండఁ దలఁపుమీఱ. 72

చ. అన విని వారు జాతకము నంతయుఁ జూచి మహీతలేంద్రుతో
ననిరి "నరేంద్ర! పుత్త్రవిష యంబును జూచితి మందుఁ బుత్త్రికా
జనన మొకండు శంభుదయ సంభవ మా నిది నిశ్చయంబు మీ
రనుముదమందుఁ డీశ్వరుని రూఢిగ నర్చితుఁ జేయుఁ డెప్పుడున్. 73

క. తొలి మీరు పేదబిడ్డలఁ
దిలకించి యసూయపడుచుఁ దిట్టినపాపం
బిల నంటె నదియ నృపవర
కలిగినదోషంబు వింటె కావున మహిలోన్. 74

ఆ. కలిమి యున్న దంచు గర్వంబుతోడ బీ
దలను జూచి తిట్టి యలఁతిచేయఁ
దగునె యెరిగైన దాన నుమాపతి
కరుణఁ గనఁడు వారి నరవరేణ్య! 75

వ. అని చెప్పి రాజు నాశీర్వదించి యిఁ కేము వోవుద మనుఁడు నాభూ
పాలుం డవ్వారికి వలసినకనకం బొసంగి మర్యాద నంపినవాఁ డయ్యె
నంత. 76

తే. పుణ్యవతి వింటె పెద్దలు పుత్త్రవిషయ
మెఱుఁగఁ జేసిన దంతయు నిపుడు మనము
సేయునది యేమి భక్తిమై శివునిపూజ
తప్ప వే ఱెద్ది లేదు పాతకము తలఁగ. 77

మ. విను మాత్మేశ్వర రాజ్యవైభవముచే విశ్వంబు గాన్పింప ద
మ్మునులం గాంచితివారిపాదకమలం బుల్ భక్తి సేవించి తం
చును నాతోఁ గడువేడ్కఁ జెప్పితివి యచ్చో వారిఁ జూడంగ ని
న్నెనియుం బోమ్మెద నంచుఁ బల్కితివి పోకుండంగ మేల్గందుమే. 78

వ. ఇపు డా యోగివీరులకడకుం జని పుత్త్రదోషపరిహారార్థం బడుగుద మూరకుండ ఫలం బేమి యనిన నారాజేంద్రుండు సంతోషించి యాసిద్ధులకడకుం బోవ నిశ్చయించినవాఁడై మఱునాఁ డరుణోదయంబున. 79

తే. మునులపాలికిఁ బోవుచు మనము రథము
నెక్కి పోవుట తగవు గా దెపుడు తరుణి
నడచి పోదము రమ్ము మనంబు లెసఁగ
నంచుఁ బరిజనములఁ గూడి యరుగుదెంచి. 80

వ. అవ్వనాంతరంబునం బ్రవేశించి పినాకినీ నదియందు దంపతులు స్నానంబుచేసి మడుంగులు గట్టుకొని వచ్చినపరిజనంబుల నట నిల్పి తాము ఫలపుష్పతాంబూలాదు లిడినట్టిబంగరు పళ్లెరంబు చేఁ బూని సిద్ధగణం బుండువటవృక్షమూలంబుకడకుం బోయి వారిముందట నా పళ్లెరంబు వెట్టి సభక్తిపూర్వకంబుగ దండప్రణామంబు లాచరించి బద్ధాంజలులై నిలువంబడిన నా దంపతులం జూచి శివయోగీంద్రుండు. 81

క. జననాథచంద్ర! నీవ
చ్చినకార్య మెఱింగినాఁడఁ జింతింపకు నీ
యనుపమభక్తికి మెచ్చితి
ననఘాయొగిఁగూరుచుండు మని యిట్లనియెన్. 82

{ శివయోగీంద్రుఁడు చంద్రగుప్తనరేంద్రునకుఁ బంచాక్షరీమంత్ర ముపదేశించి తత్ప్రభావంబు చెప్పుట. }

సీ. ధరణీతలేంద్ర! సంతానభాగ్యము నీకుఁ
బురహరుఁ డియ్యఁడె పూజసేయ
సమరకేళిజయంబు సమకూడునట్లుగఁ
బురహరుఁ డియ్యఁడె పూజసేయ
సకలపాపచయంబు సమయఁ జేసి సుఖంబు
పురహరుఁ డియ్యఁడె పూజసేయ

నజ్ఞానతిమిరంబు నడఁచి సుజ్ఞానంబు
పురహరుఁ డియ్యఁడె పూజసేయ
నరవిఁ బురహరుమంత్రరాజంబు నీవు
పరఁగ నుపదేశమునఁ బొంది భక్తి నెపుడు
జపము చేసినచో నభీష్టంబు గల్గు
గాన నామంత్రమహిమ శక్యంబె పొగడ. 83

క. పురహరునివలనఁ గాలుఁడు
హరివలన ధనంజయుండు హరిదశ్వునిచే
హరిసుతుఁడు గార్గ్యమునిచే
హరియును నామంత్ర మెఱిఁగి రవనీనాథా. 84

సీ. మఱి మంత్రముల కాది మంత్రరాజం బిది
గ్రహములయందు భాస్కరునికరణిఁ
బరమవస్తువులందుఁ బ్రాణంబుకైవడిఁ
దరువులలోఁ గల్పతరువుమాడ్కి
నస్త్రంబులందు బ్రహ్మాస్త్రంబువిధమున
ధేనువులం గామధేనువుగతి
నవతారములను రామావతారముపోలె
దానములం దన్నదానముక్రియ
మహితశైలములందు హేమాద్రికరణి
సర్వతీర్థంబులం దొగి జాహ్నవివలె
మంత్రములయందు మేటి యై మహిమఁ గాంచు
బరఁగ నామంత్ర మెఱుఁగనినరుఁడు నరుఁడె.? 85

వ. అని శివయోగీంద్రుండు నుడువ నాచంద్రగుప్తనరేంద్రుఁ డాకర్ణించి యమ్మంత్రరాజంబు నా కుపదేశింపుఁ డని పెక్కువిధంబులం బ్రార్థింప నమ్మునివర్యుం డనుకంపాయత్తచిత్తంబున నాతనిం గూర్చుండఁబెట్టుకొని యంగన్యాసాదిపూర్వకంబుగ నష్టాక్షరీ మంత్రరాజం బుపదేశించె నంత నమ్మనుజేంద్రుఁ డాయోగివీరుని పదపద్మంబులకు దండప్రణామంబు లాచరించి యి ట్లనియె. 86

### చంద్రగుప్తునకు శివయోగీంద్రుఁడు కళావతీచరిత్రంబు చెప్పుట.

తే. మహితగుణసాంద్ర యిమ్మంత్ర మహిమవలన
నెవరు శుభ మంది రవ్వారి నెఱుఁగఁ జెప్ప
వలయు నని వేఁడుచున్న భూవలయపతికి
నమ్మహాయోగివర్యుఁ డిట్లనియెఁ బ్రీతి. 87

చ. మనుజవరేణ్య యిమ్మహిత మంత్రవిశేషముచేతఁ గీర్తి నొం
దినజను లెందఱో కలరు దెల్పెద నొక్కచరిత్ర మిప్డు నె
మ్మనమున నాలకింపు జనమాన్యుఁ డుఁ ధీరుఁడు వజ్రదేహుఁ డం
చును విలసిల్లె ధర్మగుణ శోభితుఁ డర్థిజనానుకూలుఁ డై. 88

వ. అతండు కాశికాపురపాలకుఁ డై సకలవిభూతిం బొందినవాఁ డయ్యు ననపత్యదోషంబునం బెద్దకాలం బుండి పర్యవసానంబున సానంద మహర్షి వలన నిమ్మంత్రరాజం బుపదేశింపఁబడి తత్ప్రభావంబునం గొన్నాళ్లకు సర్వలక్షణసమన్విత యగు నొకకన్యకారత్నంబునుం గనియె. 89

ఆ. అంతఁ గన్నపట్టి కవనిం గళావతి
యనఁగ నామ మిడి ప్రియముగఁ బెంపు
సేయుచుండ నెలమిచేఁ గోమలం బైన
తరుణమల్లికాలతయునుఁబోలె. 90

వ. ప్రవృద్ధమాన యగుచు గురువువలన సకలవిద్యాదు లభ్యసించి సవయస్కలతో నాటలపాటలం గాలంబు గడపుచు నుండం గ్రమంబుగఁ బండ్రెండేఁడులు నిండారె నంత నొక్కనాఁడు. 91

క. గంగాతీరమునం దా, గంగాధరుఁ బోలు నొక్క ఘనయోగి కృపన్
గంగాధరమంత్రం బు, ప్పొంగఁ గళావతికిఁ జెప్పి పోయెఁ దానిన్.

ఆ. ఒరుల కెఱుఁగనీయ కుండ నెల్లప్పుడు
మానసమున భక్తి పూని జపము

చేసికొంచు నుండెఁ జెలువుగ జవ్వనం
బంతకంత నిండె నపుడు మదిని. 93

వ. జనకుం డగువజ్రదేహుండు కళావతికి వివాహంబు సేయం దలంచి వర్హావరాన్వేషణంబునకు విప్రోత్తములం బంపుటంజేసి వారి యందు. 94

సీ. బ్రాహ్మణుండొక్కఁడు వరుని నన్వేషింప
వచ్చుచుఁ బాండ్యభూవరునిసుతుఁడు
దశరథుం డనువానిఁ దగఁ గాంచి యాతండు
మనరాజపుత్రికి మగఁ డటంచు
మది నిర్ణయించి నెమ్మది నిజరాజచం
ద్రునికడకుం జని గని ముదమునఁ
దాఁ గన్న రాజనందనులకు మేటిగఁ
బాండ్యరాజసుతుండు బా గటంచుఁ

బాగడి చెప్పఁగ నారాజపుంగవుండు
సంతసము నొంది మీఁది కర్జంబు సిద్ధ
పఱిచి యాపాండ్యదేశభూపాలుసుతున
కెలమిఁ దనకూఁతు నొసఁగి పెండిలి యొనర్చె. 95

తే. అంతఁ గొన్నిదినంబులఁ గాన్యపుండు
కూఁతు నల్లునిఁ దగఁ బంపఁ గోరి వారి
కెలమి సద్భూషణాంబరంబుల నొసంగి
పాండ్యదేశంబునకుఁ బంపెఁ బ్రజలు పొగడ. 96

వ. అంత నా పాండ్యదేశాధిపతిపుత్త్రుండు కళావతిం దోడ్కొని పురం బుం జేరి. 97

క. సరగమఱునాఁటిరే బల్సరసుం డాదశరథుఁడు గళావతితోడన్
సురుచిరశయ్యాగృహమున, మరుకేళింగూడఁబోవ మగనికినవియొన్.

సీ. జననాథ యేను బంచాతురీమంత్రంబు
మద్గురు నానతి మది జపింతు
దానిచే ననుఁ గూడఁ దగ దదేమన్నను
జెప్పెద మఱి తాల్మిఁ జెంది వినుము
మహి రాజులకు బుద్ధిమాంద్యవిశేషంబు
చేత సద్బుధులతోఁ జేరకుండ
దుశ్చరిత్రులఁ గూడి దుష్కార్యములు సేయు
చుండుట సత్కీర్తి చూఱగొనుట
మద్యపానం బొనర్చుట మాంసభక్ష
ణంబు సేయుట యన్యాంగనలను గనుట
జూదమాడుట విబుధులఁ జూచి నగుట
విహితధర్మంబు విడుచుట వేఁటసనుట. 99

తే. ఇట్టిదుర్గుణములుచాల నెసఁగియుంట
వలన రాజులు పరమపావనులు గారు
గాన నీయందుఁ బరిశుద్ధి లేనికతనఁ
జెప్పితిని రాకు మింక నా చెంత కనఁగ. 100

తరలవృత్తము. విని కళావతితోడ నానృప వీరు డిట్లనియెం బ్రియం
బున మృగాక్షి మనోజబాధకుఁ బోవుచున్నది ప్రాణముల్
కనికరంబున నన్నుఁ జేరిచి కావవే యని కౌఁగిలిం
చెను మదంబునఁ దాళఁ జాలక చెచ్చెరం దమి దీరఁగన్. 101

తే. అంత నారాజపుత్త్రుఁ డాయింతి నట్లు
గలయుటం జేసి యగ్గిచేఁ గాల్చినట్లు
దేహ మెరియంగ నఱచి ధాత్రీతలంబు
నందుఁ గడు సోలి వడి వెఱపొంది లేచి. 102

తే. చిచ్చులోఁ బడి పాఱెడు చిలువకరణి
మృగయునిం జూచి పఱచెడు మృగముభంగి

పఱచునాదశరథుని నఁప్పుడంతి చూచి
పట్టి యొక్కెడఁ గూర్చుండఁ బెట్టె నంత. 103

వ. ఎట్టకేలకు నాదశరథుం డాడ లెఱింగి నలువలంకులం గలయం
జూచి డగ్గఱ నుండుకళావతితో నిట్లనియె. 104

మ. తరుణీ యే మిది వింత నాతనువు ప్రత్యక్షంబుగా నగ్నిచేఁ
బరితప్తం బగునట్టు లున్నయది యోపంజాల నీబాధకుఁ
బరసిం గ్రుంకెదఁ బోయి చల్లఁబడ నీచాడ్పాటకుం గారణం
బరయం గన్పడకున్న దం చనునిజాత్మాధీశ్వరుం బ్రీతితోన్. 105

వ. కనుంగొని యి ట్లనియె. 106

తే. మహితపంచాక్షరీమంత్రమహిమవలన
నివ్విధం బయ్యెఁ గావున నిప్డు భక్తిఁ
బరమపంచాక్షరిం దగు గురుని వేఁడి
తెలిసికొని రమ్ము సుఖ మగు దేహ మనిన. 107

క. విని యాదశరథుఁ డమ్మెయి
ఘనగురుపదపద్మపూజఁ గావించి సుభ
క్తిని బంచాక్షరి మంత్రం
బును బొంది జపింప దేహ మొగి సుఖమయ్యెన్. 108

తే. అంత నామంత్రమునఁ బుణ్యుఁ డయితి నంచు
సంతసంబునఁ దనభార్య చెంతఁ జేరి
మహితపంచాక్షరీమంత్రమహిమ యిపుడు
దెలిసితి నటంచుఁ జెప్ప నాపొలఁతి వేడ్క. 109

వ. హృదయేశ్వరుం గనుంగొని యిపుడు పంచాక్షరీమంత్రప్రభావం
బెఱింగినవాఁడ వగుటం జేసి నీదేహంబు పావనం బయ్యె నిఁక నా
తోడిసుఖక్రీడాదులతో ముదంబున నుండు మని నుడువ నాదశ
రథుం డమ్మెయి నుండఁ బర్యవసానంబున నాదంపతు లిద్దఱు శివలోక
వాసు లై రని శివయోగీంద్రుండు వక్కాణింప నాచంద్రగుప్తుం డా
కర్ణించి యాయోగివీరున కి ట్లనియె. 110

మత్తకోకిలము. ఓమునీశ్వర యిట్టిమంత్రముఁ గొందినట్టిజనంబు లె
ట్లో మహేశునిఁ బూజ సేయుదు రావిధిం గృపఁ జెప్పు మం
చామహీపతి వేడ నామహితాత్ముఁ డానృపవర్యునిం
బ్రేమఁ జూచి శివార్చనం బొనరించుమార్గము నంతయున్. 111

చంద్రగుప్తునకు శివపూజాక్రమంబు శివయోగి చెప్పుట.

వ. ఇట్లు చెప్పం దొడంగె "ప్రాతఃకాలంబున నఘపావనమంత్రరాజంబులు పఠించుచు శుద్ధతోయంబులందు స్నానంబుచేసి శుద్ధవస్త్రంబు ధరియించి జాబాలోపనిషదుక్తప్రకారంబున నుత్తమాంగలలాటభుజకంఠోరస్స్థలం బంచమంత్రంబుల నుడువుచు విభూతిం ద్రిపుండ్రంబులు దాల్చి సంధ్యావందనాది నిత్యకృత్యంబులు దీర్చుకొని వల్మీకమృణ్మయంబుగా శివలింగం బొనర్చి కరతలంబునం బెట్టికొని నమకచమకమహాన్యాసాదిమంత్రంబులు పఠించుచు గంధోదకంబున నభిషవంబుచేసి సుగంధపుష్ప శ్వేతాక్షతల నర్చించి ధూపదీపనైవేద్యంబుల నప్పార్వతీపతికిం బరితృప్తిచేసి రుద్రాక్షమాలిక చేతం బూని తన్మంత్రరాజంబును నిశ్చలభక్తి జపింపవలయు నని వెండియు ని ట్లనియె. 112

ఆ. నరవరేణ్య యట్లొనర్చినవారికి
శంకరుండు మెచ్చి సకలభాగ్య
మిచ్చు నట్టిపూజ నెవఁడు సేయును వానిఁ
గనులఁ జూడఁ బాయుఁ గల్మషంబు. 113

వ. కావున శివపూజావిధానం బిది యనిన నమ్మనుజేంద్రుఁడు విభూతిమహిమ నెఱింగింప వేఁడెద ననిన నయ్యోగీశ్వరుం డి ట్లనియె. 114

శివయోగి చంద్రగుప్తునకు విభూతిమహిమ చెప్పుట.

సీ. రాజేంద్ర తొల్లి విక్రమభానుఁ డనురాజు
దుర్జనస్నేహంబు దొడరి విప్ర
జనుల నిందింపంగఁ గని విప్రుఁ డొక్కఁ డా
గ్రహమునఁ నాతనిఁ గాంచి నీవు

భువి బ్రహ్మరాక్షసుం । డవు గ మ్మటంచు శా
పంబు వెట్టంగ భూ । పాలుఁ డట్లు
శాపంబు నొంది దు । స్సహ మగుక్షుత్పీడ
కోపక కానలోఁ । దాపసుఁ డగు
వామదేవమహాముని । శ్వరునిఁ జూచి
పట్టి భుజియింపఁ గోరి చే । రఁ బ్వడఁగ వచ్చి
కౌఁగిలింపఁగ నమ్మహా । ఘనుఁడు భూతిఁ
దాల్చియుండుటఁ జేసి యా । దైత్యవరుఁడు. 115

ఆ. ఒడలు మంట లెత్త । హాహాయని యఱచుచుం
బఱచి పురమియందుఁ । బడియె నంత
దత్ప్రభావమునకు । దైత్యరూపము వ్రావఁ
దొంటితనువు దాల్చె । దురిత మెడలి. 116

### సుధర్ముం డనువిప్రుని చరిత్రము.

వ. మఱియు నొకవిప్రేంద్రునిచరిత్రంబు నుడివెద నాకర్ణింపుము. 117

సీ. కాశ్మీరదేశభూ । కాంతుండు వజ్రదే
హుం డనురాజు పే । రోలగమున
నుండి పురోహితు । నండఁ జీరి కరంబు
కోపించి నీతి నెఱ్కొ । నఁగ ననియె
నోసుధర్ముండ నీ । కీసుధర్మాభిధే
యము సార్థకంబు గా । దవని మఱియు
ధాతృవంశమున ను । ద్భవమొందుటే కాని
వేదాదివిద్య లె । వ్వియును రావు
ముఖమునం బ్రేతవర్చస్సు । మొనయ నిట్లు
సిగ్గు లేకుండఁ గొల్వులోఁ । జేరి గొప్ప
పండితులకును సరి గాఁగ । భయము లేక
కూరుచుండుట తగునె పా । కూర్రమతుఁడ. 118

వ. అనిన విని సుధర్ముండు మోము వాంచి విన్నఁదనంబున నన్న రేం
ద్రున కిట్లనియె. 119

మ. వదలక యోనృపాల బుధవర్యులడగ్గఱఁ జేరి చక్కఁగాఁ
జదివితిఁగాని నాకు నొకశాస్త్రమునైనను రాకపోయె నే
నదిమొద లూరకుంటి నిఁకనాపయి నేనొనరించుకర్జము
న్నదియె యటంచుఁ బల్కనరనాథుఁడు విస్మయ మంది యిట్లనెన్.

సుగంధివృత్తము. ఓసుధర్మ నీవు లజ్జనొంద కిట్లు కొల్వులో
భూసురుండ వయ్యు నోటఁబూని విద్య రా దటం
చీసు కూడ లేక పల్కిటంతె చాలు పో బళీ
మానివై జనించి విద్యమాని వేయ వచ్చునే. 121

వ. అని యాభూపాలుండు పల్కటం జేసి యాసుధర్ముం డత్యంతరోషా యత్తచిత్తుం డై ఘటికాద్రికిం జని నారసింహునిమనంబునం గడు భక్తిఁ గొలువ నాహరి సత్కృపాంతరంగుం డై సకలవిద్యాపారంగతుండవు గ మ్మని వరం బిచ్చి యంతర్హితుం డయ్యె నంత. 122

తే. నిజపురంబున కేతెంచి నెమ్మి మీఱ
బంధుజనములు మిత్రులు పండితుఁ డని
పొగడఁ దనకంటె నిఁక జగంబునఁ గవీంద్రు
డుండఁ డని గర్వమును బొందియుండె నెలమి. 123

వ. ఒకనాఁ డావజ్రదేహభూపాలాగ్రణి నిత్యశ్రీమంతు లగుసామంతులును సురూపజితమారు లగురాజకుమారులును రాజ్యతంత్ర స్వతంత్రు లగుసుమంత్రులును సద్గుణసుధాసింధువు లగుబంధువులును, సకలవిద్యాంబుజాకరరవు లగుకవులును మనోసుఖసంధాయకు లగు గాయకులును గొలువ నిండుకొలు వుండుసమయంబునఁ దనయ సమానపాండిత్యంబు మెఱయింప విచ్చేయుటం జూచి నృపవరేణ్యుం డెదు రేఁగి తోడ్కొనివచ్చి యుచితాసనాసీనుం జేసి దండంబు లిడి విస్మయపరీతచేతస్కుం డై యాసుధర్మవిప్రున కిట్లనియె. 124

క. పండుని తెలిఁగున నీవిధ
ముండుట సరి గా దటంచు నురుకోపముతోఁ

బండితులయొద్దఁ జదువను
వండించితిఁ బొమ్మటంచు దానికి మదిలోన్. 125

తే. ఏమితప్పు తలంచితో యిపుడు నీము
ఖాంబుజము చూడ దివ్యతేజంబు దనరి
యుండుటం జేసి భయ మొందు చున్నవాఁడఁ
గాన మన్నింప వేఁడెదఁ గవివరేణ్య. 126

వ. అనిన విని రాజేంద్రున కాసుధర్ముం డిట్లనియె. 127

క. దండించినందులకు నిం
దుండక ఘటికాద్రి కేఁగి యురుభక్తి హరిఁ
బొందుగ నుతించి వేఁడ న
తండు మనోభీష్ట మొసఁగె దయ దయివాఱన్. 128

వ. అంత నచ్చోటు వాసి మద్విద్యాపాటవంబు భవత్సభాంతరాళం
బున మెఱయింప విచ్చేసితి ననిన నమ్మనుజేశ్వరుం డం దుండుకోవి
దోత్తములం జూచి "మీర లీసుధర్మభూనిర్జరునితోఁ బ్రసంగం బీదినం
బు సేయుం డని ముదల నియ్య వా రట్లు దమవిద్యానైపుణ్యము మెఱ
యించి పర్యవసానంబున నాసుధర్మునివలన నపజయంబు నొందినవా
రై రప్పు డారాజు సుధర్మునకు వివిధభూషణాంబరాదులు బహు
మానం బిచ్చి నిజవిద్వత్సభానాయకుం జేసినవాఁడై యంత నొక్క
నాఁడు. 129

తే. ధారుణీపతి శూలివ్రతంబు చేసి
భూసురేంద్రులకుఁ భక్తి పూర్వకముగ
దానములు సేయు చుండ సుధర్ముఁ డెఱిఁగి
వచ్చి రాజేంద్రు ననియె నివ్విధంబు మీఱ. 130

సీ. విను రాజవర్య యీ విప్రులయం దుండు
పండితులం గొన్ని ప్రశ్న లడిగి
పాండిత్యమును గాంచి బహుమానము లొసంగ
నది యుక్త మగు నూర కందఱకును

భూదానగోదానములోనంగ ఫలమేమి
　　యనఁగ నమ్మను జేసెఁ డాసుధర్ముఁ
గని యిట్టు లనియె నోకవిపుంగవా నీకుఁ
　　దోఁచినరీతిగఁ దొడరి చేయు
మంచు నానతియ్య నాసుధర్మాఖ్యుండు
బ్రాహ్మణోత్తములను బరిభవించి
హా మ్మటంచుఁ బల్కి భూదేవునిం జూచి
వృద్ధవిప్రుఁ డగువికిరించి యచట. 131

తే. కూరుచుండియు ననియె మూల్గుచును లేచి
విప్రుఁడా! నీవు నాకంటె విశ్వమందుఁ
బండితుఁడు లేఁ డటంచు నిబ్బంగి బుధులఁ
బరిభవము సేయు టుచితంబె పాఱుఁ డయ్యె. 132

వ. మఱియు బ్రాహ్మణులను వేదములను గులస్త్రీలను బేదవాండ్రను నతిథులను వృద్ధులను గ్రుడ్డివాండ్రను సన్న్యాసులను గురువులను మాతాపితలను స్వరాజును స్వబంధుజనంబులను విద్వాంసులను గౌరవింపందగు నట్లు సేయం బరమశోభనం బిట్టిధర్మ మెఱింగి మిన్నక వదరుచున్నాఁడ వీఁక నూరకుండు మని వెండియు నిట్లనియె. 133

సీ. కలహంస లేనట్టి కమలాకరంబునఁ
　　గులుకుచుఁ దిరిగెడు కొంగ హంస
కోయిల లేనట్టి కొమరారువనమునఁ
　　గూయుచుండెడుగూబ కోకిలంబు
ధేనువు లేనట్టి దేశంబులోనుండు
　　మహిషంబు పరికింప మహితగోవు
చూడవృక్షము లేని చోట నుండెడుతాళ
　　వృక్షంబు గద కల్పవృక్ష మింక
పండితుఁడు లేనిరాజసభాస్థలమునఁ
బరఁగునీవంటిశుంఠయ పండితుండు

చదువుకొన్నట్టివాఁ డని జనము లెల్లఁ
దెలిసికొన్నారు పొమ్మికఁ బలుక నేల. 134

వ. అని మాయయజుండుపల్కుటం జూచి సుధర్ముం డలుక మించి యవ్విరించి కిట్లనియె. 135

తే. పొగరు మించెనో బడుగువిప్రుండ నీకు
నూర కిచ్చోటఁ గూర్చుండికయుండ కుండఁ
బ్రల్లదము లాడె దౌరౌర ప్రజ్ఞ దప్పి
చదువు లేనట్టిమూఢుఁడా! చాలుఁ బొమ్ము. 136

క. ఈమీఁదట మాటాడిన
చో మానము పోవు నడచు చుండుము మఱి నీ
వే మేమి చదివి నాతో
సామర్థ్యము సూప నిట్లు చనినాఁడ వనన్. 137

తే. మాయవిప్రుఁడు గాంచి యో మాయవాది!
బ్రహ్మకులఘాతకా! నన్నుఁ బ్రళయరుద్రుఁ
డైన మొండొడ్డి మాటాడ కవలఁ బొమ్మ
టంచుఁ బల్కెనె! యేమిధైర్యం బయారె! 138

తే. మఱియు నే మేమి చదివి సామర్థ్య మిందుఁ
జూప వచ్చితి వంటివి చుల్కఁదనము
చేత నీ వేమి చదివితోఁ జెప్పు కొంత
చూత మూరక యీరాజుచూచి నిన్ను. 139

వ. పండితుం డని మెఱమెచ్చుసేయుంగాని యీసభాసదు లెవ్వరు నిన్నుఁ గొనియాడ రింకఁ గపటవిద్యాప్రసంగం బేసభయందుం గాని సేయకు మనిన నాసుధర్ముం డిభరాజేంద్రుమీఁది కుఱుకుకంఠీరవంబుచందంబున సరగున నమ్మాయావిప్రునికరంబువట్టి సభనుండి యీవలకు నీడ్చి పొమ్మనుటం జూచి యయ్యజుం డి ట్లనియె. 140

తే. ఓరిపాపాత్మ! రాజు విప్రోత్తములకు
నీవు లిచ్చెడు వేళ నీ వెచటనుండి

వచ్చితివి పాఱునీటికాల్వను జెడంగఁ
బోఁచవడినట్లు దాన మీఁ బోకుఁ డంచు. 141

వ. వచియించి విప్రుల కొసంగ నీక వారిం బరిభవించుటం జేసి దగవు గాదని నీతిచెప్పి తండులకుం గావరంబున. 142

సుగంధివృత్తము. నోరు మూయు మంటి నన్ను నోరికొద్ది ధాత్రిలో
నోరు లేక యుండు నీమనోరథంబు దీరఁగా
నోరి మూఢ యంచు నబ్జయోని నాల్గుమోములం
బే రెఱుంగఁ జూపి వ్రాయె భీతిఁ జూడ నెల్లరున్. 143

వ. అంత నాసుధర్మునకు మూఁగతనంబు వాటిల్లుటం జేసి రాజేంద్రుండు తనమనమ్మున. 144

ఆ. ఏల యీసుధర్ముఁ డెదిరించి పండితో
త్తములతోడ లేని తర్కమాడి
పరిభవం బొనర్చె బ్రహ్మశాపం బిప్డు
తొలఁగుమార్గ మెద్ది తలఁప నంచు. 145

తే. ఆసుధర్మునిసోదరు నంతఁ జూచి
యోవిశుద్ధుఁడ! నీయన్న కావిరించి
యిడినశాపంబు వాయంగ నెద్ది యైనఁ
జూడు మొక్కయుపాయంబు చొప్పడంగ. 146

వ. అన విని విశుద్ధుం డట్లు చేసెద నంచు నన్నం దోడ్కొని యింటి కేఁగి శాపం బెవరివలనం బాయు నని తలంచుచునుండి "తొల్లి విద్యాదానంబు చేసినఘటికాచలేశ్వరుపాలికిం బోవ నీశాపం బుడివోవం జేయు నని యాఘటికాద్రీశుఁగూర్చి. 147

చ. తప మొనరించె నన్నకుఁ బితామహుఁ డిచ్చినయుగ్రశాపముం
గృపఁ దొలఁగింప నానరహరి న్మది నిల్పి సుభక్తి నంత నా
తపమున కారమేశుఁడు ముదంబును బొంది విశుద్ధుఁ జూచి స
త్కృప ననె నిట్లు విప్రుఁడ విరించియొసంగినశాప మే నొగిన్. 148

ఆ. తొలఁగఁ జేయ నేరఁ డొలి యొసంగినవరం
బునకు విప్రకోటిఁ బూని నింద
చేసి రా జొసంగు కా సియ్యనీ కుండఁ
జేసె నజునిఁ దిట్టెఁ జేవ మించి. 149

వ. అట్టిదుష్టున కిడం బడినశాపకార్యంబు దక్క నితరంబు వేఁడు మను
గ్రహించెద ననిన నవ్విశుద్ధుండు పలువిధంబులం బ్రార్థించినం గా
నిఫలంబు లేదయ్యె నంత నానరహరిం జూచి విశుద్ధుండు దురాగ్ర
హంబున నిట్లనియె. 150

క. ధర నీవ దైవ మని యి
క్కరణిం దపమాచరింపఁ గా నిక్కర్జం
బరయఁగ నాచేఁ గాదని
దిరముగఁ బల్కితివి మంచిదేవుఁడవె బళీ. 151

తే. మును త్రిశంకుని గౌశికమునియు స్వర్గ
మందుఁ జేర్పఁడె యాకీర్తి నెందఁ దైన
నుండదే ధాత్రియందును నుల్ల మలరఁ
బ్రోచువారలు కరుణింపఁ బోలదొక్కొ. 152

వ. అని గర్వంబు మించి పల్కినట్టివిశుద్ధుం గాంచి నరహరి కోపోద్రిక్తుం
డై యిట్లనియె. 153

తే. కలుషచిత్తుండ వీయన్న కంటె నీవు
కావరము మించి ననుఁ దిరస్కారముగను
మాటలాడితి వింక నానాఁటి కొడలు
చెడి కృశించెద వని హరి చెప్పి చనియె. 154

వ. అంత నావిశుద్ధుఁ డాశాపంబునకుం గడుభీతి నొంది "యన్నము భ
క్షింపం బోయి తద్భాండముఖంబును గంఠంబునం దగిలించికొన్నసా
రమేయంబుభంగి నా కిట్లు సంభవించెను గదా" యంచుఁ జింతించు
చు నిజగృహంబునకుం జని యన్న కెఱింగింప నతండు భయభ్రాం

తచిత్తుం డై యూరకుండెనంత నావిశుద్ధుండు వజ్రదేహరాజుకడకుం
బోయి జరిగినవృత్తాంతం బెల్ల నుడువ నాతఁడు కోపించి యి ట్లనియె.

ఆ. సర్పపేటిఁ గొఱకి ౹ సర్పంబుచేఁ దినం
బడినమూషికంబు ౹ భంగి యన్న
కొఱకు నీవు పోయి ౹ క్రూరశాపము నొంది
వచ్చితే దురాత్మ ౹ వగచు చిట్లు. 156

ఉ. ఇంతకు మీయదృష్ట మిల ౹ నిమ్మెయి నేర్పడియుండ నూరకే
చింత పడంగ నేల యిఁకఁ ౹ జేసెడుకార్యము చూడఁ దోఁపదే
దింతకు మిమ్ముఁ దోడ్కొని మ ౹ హిం గలతీర్థములందు ముంచెదన్
స్వాంతము మీఱఁ దన్మహిమ ౹ వారక కావదె యంచు నెమ్మదిన్.

క. ఆవిప్రులఁ దోడ్కొని తా, దేవాగారంబులకును ౹ దీర్థంబులకుం
బోవుచుఁ గేదారేశుని, భావం బారంగఁ గొల్వ ౹ బార్థివుఁ డెలమిన్.

మ. చని యవ్విప్రులు దాను నచ్చటఁ బ్రశ ౹ స్తం బైనతీర్థంబునం
దును పాపం బుడివోవఁ గ్రుంకి మడుఁగు ౹ ల్లోఁ దాల్చి కేదారనా
థునిఁ బ్రార్థింపఁగ వచ్చునప్పు డట వృ ౹ ద్ధుం డర్కతేజుం డుమే
శునిచారిత్రము చెప్పుచుండఁగ జనుల్ ౹ సొంపార నాలించుచున్.

తే. కూరుచుండంగ వారితోఁ ౹ జేరి తాము
కొంత నాశివచరిత మ ౹ త్యంతభక్తి
విని ముదంబునఁ బౌరాణి ౹ కునకు మ్రొక్క
నతఁడు దీవించి మీ రెవ్వ ౹ రనుచు నడుగ. 160

క. ఆవజ్రదేహభూవరుఁ
డావృద్ధుం బ్రీతిఁ గాంచి ౹ యనఘాత్మ ధరి
త్రీవలయమునం దేనొక
భూవరుఁడను వజ్రదేహ ౹ భూపాహ్వయుఁడన్. 161

తే. వీరు నాకుఁ బురోహితు ౹ లీర్వురి కిపుడు
కమలజాచ్యుతు లిడినశా ౹ పములు తలఁగఁ

వెంటఁ దోడ్కొని వచ్చితి విమలతీర్థ
సేవనము సేయ ననఁగ భూదేవుఁ డంత. 162

తే. క్షితి నరేంద్రుఁడ తమపురోహితుల కిట్టి
యాపదలు వచ్చెనేని నరాధిపతులుఁ
బ్రోతురే క్షేమ నిజకార్యపూజ ముడిగి
యింతకంటె శుభంబు నీకెద్ది తలఁప. 163

క. అని తచ్ఛాపవిమోచన
మును జెప్పఁ దొడంగె రాజపుంగవ యటకుం
జనకుం డిటఁ గూర్చుండుఁడు
ఘనమహిమాఢ్యుండు శిష్యగణసంయుతుఁ డై. 164

వనమయూరవృత్తము. వచ్చును దధీచిమునివర్యుఁ డిటకుఁ మీ
వచ్చినది చెప్పుకొని వందనము లొలిం
గ్రచ్చుఁడు నొనర్చు ననుకంప వెలయం దా
నిచ్చును వరంబు భయమేటి కని వేడ్కన్. 165

వ. అప్పౌరాణికుం డగువృద్ధవిప్రేంద్రుండు చెప్ప నాసుధర్మవిశుద్ధులతో
నావజ్రదేహభూపాలుం డయ్యెడం బాయక కూర్చుండు సమయంబు
న ధవళభస్మరుద్రాక్షమాలికాసమలంకృతుండును మహాదేవసంకా
శుండు నగుదధీచిమునివరేణ్యుండు శిష్యబృందంబుతో వచ్చుటం జూ
చి యచటిబ్రాహ్మణోత్తములు సమర్యాదంబుగా నుచితాసనాసీ
నుం జేసి శిష్యగణంబులం గూర్చుండంజేసి కుశలప్రశ్నంబు లడిగి
రాసమయంబున వజ్రదేహుండు సుధర్మవిశుద్ధుల నమ్మునిపదపద్మం
బులకు నమస్కరింపుఁ డనితాను భక్తిపూర్వకంబుగ దండప్రణామం
బులాచరించి శాపకారణంబు నుడువ నమ్మునీంద్రుఁడు విస్మయపరీత
మానసుం డై యన్నరేంద్రున కిట్లనియె. 166

తే. బ్రహ్మవంశోద్భవులకు గర్వంబు గూడ
దెప్పుడును శాంతమును బూని యెఱిఁగినైనఁ

ప్రీతిఁ గని పల్కవలయును నృపుఁడు ధర్మ
పథము చరియింపవలె దీనబంధుఁ డగుచు. 167

వ. ఇట్టిధర్మం బెఱుంగనివారల కాయుమానాథుం డైనం దోడ్పడఁడు గావున నీవు బ్రాహ్మణభక్తి గలవాఁడ వగుటం జేసి యివ్విప్రుల యందు నీయందుం గల్గిన ప్రేమ నెఱపి యిప్పటిశాపంబు వాయం జేసెద నని పంచమంత్రంబులం బఠించుచు ఘోరపాతకవ్రజవిధ్వంసి యగుభూతిం జేకొని యవ్విప్రుల దేహంబులకుం బూసి వారివక్త్రంబులం గొంత యిడి మీశాపంబు లుడిపోయె నిఁకఁ బరమశాంతస్వాంతు లై సుఖం బుండుఁ డని యాశీర్వదింప నవ్విప్రులు పునఃపునఃప్రణామంబు లమ్మునివరేణ్యునకుం జేసి రాజేంద్రునితోడ నాకేదారేశ్వరునిఁ బూజించి నిజపురంబునకుం జని శాపవినిర్ముక్తు లై సుఖం బుండి రనిన విని చంద్రగుప్తుండు రుద్రాక్షమహిమ కొంత వక్కాణింపు మనుడు శివయోగీంద్రుం డాకర్ణింపు మని యిట్లనియె.

శాంతికుం డనువిప్రునిచరిత్రము.

సీ. వినుము రత్నాకర మనుపురంబున శాంతి
కుం డనునొక్కవిప్రుండు హితులఁ
గూడి బాల్యమునందు నాడుచుండంగ రు
ద్రాక్ష యొండు లభించె దానిఁ బ్రీతిఁ
గంఠంబున ధరించి కాలకంఠునియందు
నతిభక్తి గల్గి తా నాఁటఁగోలెఁ
దనయన్నదమ్ములఁ దల్లిదండ్రులఁ బాసి
విహరించుచుండె నివ్విధిని నుండ
జనులు గని గేలిచేయుచు మొనసి వెంటఁ
దిరుగు చుండినవారలఁ దిరిగి కూడ
చూడ కందందుఁ దిరుగుచుఁ జూపఱకును
వెడగువాని తెఱంగును దొడరి యుండె. 169

వ. ఇట్లుండ మహదైశ్వర్యంబుకొఱకుఁ గేరళదేశాధిపతి ప్రతివత్సరంబున నాశ్వయుజ శుద్ధాష్టమినాఁడు దుర్గాదేవికి నరబలి యొసంగుటం జేసి తద్బలిదినంబున నొకమనుజుం డైన బలికి లభింపకుండుటం జూచి తనపురంబున నున్మత్తవృత్తిం దిరుగుశాంతికునిఁ దెం డని చారులం బంప వా రాశాంతికుం దోడ్కొని రాజేంద్రునెదుట నిల్పి రంత మానవేశ్వరుండు పురోహితప్రోక్తసంకల్ప పూర్వకంబుగఁ బావనమంత్రంబులతో గంధోదకంబున స్నానంబు సేయించి నూతన రక్తవస్త్రాలంకారంబుల నలంకృతుం జేయించి మేన జొబ్బిల్ల మృగనాభిఘనసారమిళితచందనం బలఁదఁ జేసి రక్తపుష్పమాలికలు గంఠంబునఁ బెట్టించి ముఖంబునం గుంకుముబొట్టును బెట్టించి పరిజనాళితో నానగరమార్గంబునం దప్పెటలు భేరులు ఢోల్లు బాఁకాలు తారలు ఢక్కలు కంచుబూరలు శంఖంబులు కొమ్ములు గగ్గరెట్లు పీరరుంజలు పంబాలు మద్దెలలు తాళంబులు మున్నగువాద్యంబులు చెలంగ నర్ధరాత్రంబునఁ గాళికాలయంబునకుఁ గొంపోయి దేవిముందట నిలువంబెట్టి యాదుర్గను బూజించి వివిధమాంస భక్ష్యంబులును సారతరరసాయనంబులును దధిఘృతసూపపక్వాన్న శాకమద్యగుడోదకఫలగోక్షీరశర్కరాదులు నివేదించి శాంతికుని బలి యిచ్చుటకుఁ గరవాలంబు గొనుటంజేసి యాదేవి హాహాకారంబుసేయుచు నాతేనిం జూచి యి ట్లనియె. 170

సీ. ధరణీశ రుద్రాక్షు | ధరియించి శంభుని
    పగిది నివ్విప్రుండు | వఱలువాఁడు
భళి యిట్టివానిని | బలికిఁ దేఁ బాడియె
    మోఱకుఁడా యిప్డు | మొనసి నిన్ను
నాహారముగఁ గొందు | ననఁగ నానరపతి
    భయచిత్తుఁ డగుచుఁ గా | పాడు మంచుఁ
బ్రార్థింప నాదేవి | పరమదయార్ద్రి యై
    బలి పుచ్చుకొనక యీ | పగిది నింకఁ

జేయకుండు మంచుఁ జెప్పి పొమ్మని యంత
భవునిభక్తి నొసఁగి పల్కకుండ
మోఁగిల నిలచి యుండు శూలిసముం డగు
శాంతికునకు ననియె సంతసమున. 171

మ. నిను భక్షింపను విప్రవర్య మది దేనిం గోరెదో దాని ని
త్తు నటంచుం బలుకంగ శాంతికుఁడు సంతోషించి ప్రార్థించి యి
ట్లనియెం గోరెద నిమ్ము మీబలిభయంబై నట్టి దీభూతలం
బున నింకెప్పుడుఁ గోరకుండు జననీ స్ఫూర్జత్కృపాస్వాంత వై.

తే. అంచుఁ బ్రార్థింప నాజగదంబ గాంచి
వర మొసంగెను భూసురవర్యుఁ డెలమిఁ
గోరినట్లుగ నాగి శాంతికుండు భక్తి
మ్రొక్కి యేఁగెను భూవర ముదము మీఱ. 173

వ. అన విని చంద్రగుప్తుఁడు శివరాత్రివ్రతమహిమ విన బుద్ధిపొడము
చున్న దన నాయోగీంద్రుం డి ట్లనియె. 174

శివరాత్రివ్రతమహిమము.

సీ. శివరాత్రిదినము నిశ్చింతమై నుపవాస
ముండి గంధోదకంబున భవునకు
నాల్గుయామంబుల నమకాదిమంత్రరా
జంబుల నభిషేచనంబొనర్చి
భూతిగంధాక్షత పుష్పాదు లం దగఁ
బూజించి దివ్యనీరాజనాదు
లొసఁగి సత్ఫలచయాద్యుచితభక్ష్యంబుల
నొసఁగ నివేదించి మొరఁగి రేయి
నిదుర పోక మహేశుని పదసరోజ
ములఁ దలంచుచు మఱునాఁడు చెలఁగి విప్ర
పుంగవుల కెల్ల మృష్టాన్న భోజన మిడి
సంతస మొనర్ప శివుఁ డిచ్చు సంపదలను. 175

### విబుధుండను విప్రునికథ.

వ. మఱియు నీశివరాత్రివ్రతమహిమచే నొకభూసురుండు శివలోకవాసుం డయ్యె నవ్వానిచరిత్రంబు గొంత వక్కాణింతు వినుము తొల్లి కుంజరపురంబునందు విబుధుం డనునొకబ్రాహ్మణుం డుండె నతండు శైశవదశ నుండి శివాలయంబున కేఁగి బిల్వంబు గోసి శివస్మరణంబు చేయుచు లింగంబుపైఁ బెట్టి పూజించి తనకుఁ దినుటకుం దల్లి యొసంగినయడుకుల నాశివున కర్పించి తిను మని ప్రార్థించుచు నమస్కరించుచు నాశివపూజయం దిట్లతిభక్తి కల్గియుండె నంతకంతకుఁ బ్రాయంబు వచ్చుటం జేసి కొడెకాండ్రతోఁగూడి శివార్చన మఱచి తలిదండ్రులమాట లాలింపక చేత దొరకినధనంబెల్లం గొంపోయి యాటకత్తియల కొసంగుచు వారియం దనురాగంబు మించి యుండె నిట్లుండ నొక్కనాఁ డావారాంగనలకు నిచ్చుటకు ధనంబు లేమిం జేసి దుర్మార్గప్రవర్తనంబునకు లోఁబడి యొకశివరాత్రి నాఁడు శివాలయంబులోనికిం జని విగ్రహంబులకు నలంకరించిన యాభరణాంబరంబులం గొనిపోవ సమకట్టి యొక్కెడ మఱింగి యుండె నారాత్రి విప్రోత్తములు శివలింగంబునకు మహాన్యాసాది మంత్రరాజంబుల నభిషేచనాదిపూజలు సేయుచుండ నవ్విబుధుండు కనులారం జూచి యమ్మంత్రంబు లాకర్ణించుచుండెం గాని భూషణంబులు సంగ్రహించుటకు సమయంబు రా కుండి యొకించుక నాల్గవజామున సమయంబు లభించుటం జేసి తద్భూషణాంబరంబులు గ్రహించుకొని వచ్చుచుండ నర్చకుండు చూచి పట్టుకొని దేవుని వస్త్రభూషణంబు లెట్లు నీకు లభించె నని యడుగఁ బ్రత్యుత్తరంబు చెప్పమికి వీఁడు చోరుం డని కొట్టుటం జేసి యామోఁదుటల కోపక భూమిపయిం బడి కాలధర్మంబు నొందుటం జేసి యమభటులు వాని వచ్చి కొంపోవుసమయంబున శివకింకరులు వచ్చి యమభటుల నివారించి యి ట్లనిరి. 176

క. ఈవిబుధుని మీరలు గొం, పోవుట ధర్మంబు గాదు పుణ్యాత్ముండితం
డీవసుధ నితని బోలిన, పావనుఁ డొక్కండు గలఁడె పాటింపంగన్.

తే. ఇతఁడు బాల్యంబునందు ను మేశుఁ బూజ
చేసె వారాంగనలకుఁ దాఁ జిక్కి పాప
కృత్యముల్ చేసినను శ్రీగిరీశునిలయ
మున ముదంబున శివరాత్రి దినమునందు. 178

వ. ప్రాణావసానంబునం జేరి నిద్ర లేక మహాన్యాసాదిమంత్రంబు లాక
ర్ణించుచు శివలింగార్చనంబుం జూచుచు నుండి శివాలయంబునం
దనువు విడిచెం గావున నితం డాయుమానాథునిపదపద్మంబులకడ
నుండువాఁ డని నుడివి విబుధునిం గొంపోయి కైలాసంబునం జేర్చిరి
కావున. 179

తే. మానవేశ్వర శివరాత్రి మహిమ వింటె
మఱియు శివనామమహిమచే మాన్యు లమిత
భూతిఁ జెన్నొంది శివలోక మాతతరతి
జేరి రా శివుభజనన చేయు మెపుడు. 180

వ. దాన నీకుఁ బుత్త్రికాప్రాప్తి యై మహాయశోధనంబుఁ గాంతువు పొ
మ్మని దీవించుటం జేసి చంద్రగుప్తుండు పత్నీసమేతుం డై యమ్మ
హాయోగిగణంబునకు దండప్రణామంబు లాచరించి పరిజనంబులతోఁ
బురంబు సేరి యోగివరోపదేశమంత్రరాజంబును బఠించుచు నిజ
రాజ్యశ్రీధురంధరుం డై యుండె. 181

ఆశ్వాసాంతము.

క. శంకరహిమాద్రిజాత్మజ, శంకరయోగీంద్రమానసాలయ బాలా
శాంకకళాధర పృథురో, మాంకారి త్రిశూలపరశుహస్తమఖారీ.

తోదకవృత్తము. పరమదయాకర భాసురదేహా
వరవిబుధవ్రజ వంద్యపదాబ్జా
పురహరకాంచన భూధరచాపా
సురరిపుదుర్మద శోష మహేశా. 183

## గద్యము.

ఇది శ్రీమదాలూరువంశపయోధిరాకామృగాంక రామ
కృష్ణదైవజ్ఞపుత్త్రి సుజనవిధేయ వాసుదేవనామ
ధేయప్రణీతం బైన శ్రీసిద్ధేశ్వరీయం
బను మహాప్రబంధంబునందుఁ
ప్రథమాశ్వాసము.

సంపూర్ణము.



శ్రీ ర స్తు.

శ్రీగణేశాయనమః.

# శ్రీ సిద్ధేశ్వరీయము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీమత్ప్రాణవనివేశా
కామితసత్ఫలవిధాయక కాసర్వేశా
కామాక్షీహృదయేశా
శ్రీమత్పురఘుటపుకేశ శ్రీసిద్ధేశా. 1

వ. ఆవలివృత్తాంతంబు వినుం డని యమ్మునులకు సూతుం డిట్లనియె. 2

శిశిరఋతువర్ణనము.

తే. భువనములు గెల్వఁ బోయెడు పుష్పశరుని
చమువునను రేఁగురేణుసంచయ మనంగఁ
బ్రవిమలాంబుదసితతుషారంబు దిశల
నోలసి శిశిరంబు చనుదెంచె నుత్కటముగ. 3

క. తనరాక తెలియఁ దుహినం
బును బుచ్చెనొ పగతుఁ డంచుఁ బొల్పఱి దైన్యం
బున నున్నవనఁగ సరసుల
వనరుహషండంబు మిగుల వాఁడి కృశించెన్. 4

తే. కొదమ తేఁటులు తేనెలు గ్రోలి పూల
గుత్తులం బాయ నోపక మత్తు నొంధి

యున్న వనఁ బూలరేకులు ఽ వన్నె మాసెఁ
బూదుమారంబుతోఁ గూడి ఽ పోఁడిమి చెడి. 5

ఆ. సరసులకును బోక ఽ పురుషులు తరుణుల
నాభిసరసులకుఁ జ ఽ నం దలంత్రు
వసుధ వస్త్ర మయ్యె ఽ వైశ్వానరుం డాగి
వృద్ధజనులఁ బ్రక్క ఽ విడక చేరె. 6

## పుణ్యవతీదేవిగర్భంబు ధరియించుట.

క. భూరమణవర్యుఁ డావలి
కారునఁ బుణ్యవతిఁ గూడి ఽ కరమనురాగం
బారఁగ నుండం గరుణాం
భోరాశి హిమాచలేంద్ర ఽ పుత్త్రీశకృపన్. 7

వ. కొన్ని దినంబులకుఁ బుణ్యవతీదేవి గర్భంబు దాల్చె నంత. 8

క. నెల మసలెఁ బుణ్యవతి కోఁగిఁ
దెలిగేదఁగి రేకుఁబోలెఁ ఽ దెలుపారె ముఖం
బలసటలు దోఁచె నొడలికి
నలుపెక్కెను జన్నుఁగవమొ ఽ నలు నలువారన్. 9

క. చెలువారెడువల్వలు సొ
మ్ములు దాలిచి చెలులఁ గూడి ఽ ముదమున నెలదోఁ
టల కేఁగి మావిసీడలఁ
గలవంటకములను మెసవఁ ఽ గల్గెఁ దలంపుల్. 10

వ. ఇట్లు దౌర్హృదోద్రేకంబున నుండుపుణ్యవతిం జూచి ప్రియంబున నరే
శ్వరుం డిష్టాపూర్తి సేయుచుండె ననంతరంబ. 11

తే. నెలలు నిండారె నుపచార ఽ ములు ప్రియమునఁ
జేయు చుండిరి పొలఁతులు ఽ పాయకుండ
నొక్కదినమునఁ జూలుకు ఽ ట్టొదవి గిరిజ
నాథుకృపచేత సుశుభల ఽ గ్నంబునందు. 12

చంద్రగుప్తనృపుఁ బుత్త్రిక జనించుట.

తే. తమశుభస్థానములను సద్గ్రహములు
దనరుచుండఁగ వంశపావనము గాను
బుణ్యవతికిని నెలమిగఁ బుత్త్రి గల్గె
పూర్ణదుగ్ధాబ్ధిలో లక్ష్మి పుట్టినట్లు. 13

క. జనియింపఁగ నవ్వార్తను
విని రాజోత్తముఁడు వేడ్క విప్రుల కెల్లన్
ధనధాన్యశర్కరాదులు
ఘనసంతోషమున నొసఁగె గౌరవమారన్. 14

సీ. అంత నాపుట్టిపాలంతికి నెలఁతలు
నానాఁటిపురుడు సనంగఁ జేయ
మేదినీశుఁడు బంధుమిత్రుల రావించి
పండ్రెండవదినంబు పత్ని యెలమి
మంగళస్నాతయై రంగార వాద్యముల్
చెలఁగ విప్రేంద్రు లాశీర్వదింప
బంగరుపీఁటపైఁ బత్నితోఁ గూర్చుండి
రహిని బురోధఃపురస్సరముగ
సరవిఁ బుణ్యాహవాచన జాతకర్మ
ములను దగఁ దీర్చి శివయోగి మునిఁ దలంచి
నామకరణంబు చేసె జనాళి మెచ్చ
సత్యవతి యని పట్టికి శంభు నెంచి. 15

వ. అంత బ్రాహ్మణోత్తములకు ధనకనకాభరణాంబరంబులును భూగోగజాశ్వాదానాదులును సంతోషంబుగ నొసంగి నిజపురోహితునక మూల్యాభరణాంబరంబు లొసంగి సమర్యాదంబుగా నంపి వచ్చిన బంధుమిత్రజనంబులను భక్ష్యభోజ్యాదులం దనిపినవాఁడై నాఁటఁగోలెఁ బుత్త్రికయం దత్యంతానురాగంబు గల్గి యుండెఁ బూర్వపక్షచంద్రుంబోలె నాశిశువు క్రమంబునం బ్రవృద్ధమానం బగుచుండె.

క. అడుగులు తడఁబడఁ బుడమిం
గడుకొని నడనంగ నేర్చె గజ్జెలు మ్రోయం
గడు వేడ్కఁ దల్లిదండ్రులు
పొడసూడఁగ నడచు బెడఁగు పొంపిరిప్రోవన్. 17

తే. చిల్కపల్కులవలెఁ దేనె లొల్కు పల్కు
లాడ నేర్చెను సరవిగఁ దోడిబాలి
కావళిం గూడి యాటల నాడ నేర్చె
భూరిభూషలు వస్త్రముల్ గ్గోర నేర్చె. 18

వ. ఇట్లు శైశవదశ గడచి దశవర్షవయస్కురా లై జననీజనకులకుం బ్రియంబు చేయుచుండ నామాతాపితలు నిజపురోహితోత్తముని కడకు నంపి సత్యవతిని జదివింప నాబాలిక తొల్లింటిపుణ్యంబుచే వివిధవిద్యానైపుణ్యంబును దైవభక్తియుం గల్గి ప్రతిదినంబును. 19

క. తనజననీజనకుల కి
ట్లని చెప్పక తెల్లవాఱు నప్పటికిఁ బినా
కిని కేఁగి మునిఁగి వస్త్రం
బును దాల్చి సుపుష్పతతులఁ బుట్టకు నెసఁగన్. 20

తే. కోసికొని సిద్ధలింగేశు గుడికి నేఁగి
సిద్ధలింగేశ్వరుని మదిఁ జేర్చి పూలఁ
భక్తిఁ బూజించి మ్రొక్కి తా భయము గదుర
మందిరంబునకుం జని మాత యెదుట. 21

వ. అట్టిట్టు దిరుగుచుం దల్లితోఁ బ్రియవచనంబు లాడుచు నన్నంబు భుజించి శృంగారసౌధోపరిభాగంబునం బ్రియబాలికారత్నంబులతోఁ జేరి యాటలం బాటలం గాలంబు పుచ్చుచు నుండి యొక్కనాఁడు. 22

ఉ. ఎప్పటియట్ల లేచి నదికేఁగి మునింగి మడుంగుఁ గట్టి తా
నప్పరమేశునిం బొగడుచానదిగట్టునఁ బూలతోఁటలో

నొప్పెడుపూలు గోసికొనుచుండఁగ శ్రీశివయోగిపుంగవుం
డప్పుడు త్రోవ నేఁగుచుఁ బ్రియంబున నానృపకన్య కిట్లనెన్. 23

శివయోగీంద్రుఁడు సత్యవతికి సౌరమంత్రం బుపదేశించుట.

ఉ. అమ్మ యిదేమి యొంటి యిట కర్కుఁడు పుట్టక మున్న వచ్చి పూ
లిమ్మెయిఁ గోయుదానవు మహీశునిపుత్త్రికగావె నిన్ను నో
యమ్మ నెఱింగినాఁడ మహాత్మ శివాధిపు సత్కృపాకటా
క్షమ్మున నుద్భవించితివి గావున రమ్మిట బాలికామణీ. 24

వ. అని దగ్గఱకుం బ్రియంబునం జీరి కూర్చుండఁ బెట్టికొని "నీకు మ
హేశ్వరభక్తి వొడముటకు నమ్మహేశునను గ్రహంబున నీవు జనిం
చుటకారణంబు గావున నీ సచ్చరిత్రంబునకును దైవభక్తికిని మెచ్చి
విచ్చేసితిఁ దొల్లి దూర్వాసోమునీంద్రుఁడు కుంతి కుపదేశించిన శ్లోక
మంత్రరాజం బుపదేశింతు నయ్యది. 25

తే. సకలపాపహరంబు మోక్షప్రదంబు
నఖిలరిపుచయగహనదవానలంబు
సర్వరోగాపసిధ్రివజ్రంబు చువ్వొ
సౌరమంత్రంబు వేదవేద్యంబు తన్వి. 26

శా. దానిం జెప్పెద నిశ్చలత్వమునఁ బ్రాతఃకాలముం దొప్పఁగ
ధ్యానంబుం దగఁ జేయు శాశ్వతనితాంతైశ్వర్యముం గల్గు ని
త్యానందం బొనరించు శత్రువిజయం బైకీర్తి వాటిల్లు నే
దేనిం గోరినఁ గాంతు విమ్మహి నిజం బేపారు నమ్మా యనన్. 27

క. విని సత్యవతి మహాముద
మున నాశివయోగిపాదములఁ బ్రాలి ప్రియ
మ్మున నుపదేశింపుఁడు నై
కొసమెద నామంత్ర మనఁగఁ గూర్మి యొసంగన్. 28

వ. అమ్మహాయోగివర్యుం డాసౌరమంత్రరాజంబును సత్యవతి కుపదే
శించి శాశ్వతకీర్తి పొందుఁ గాత మని యాశీర్వదించి యంతర్హితుం
డయ్యె నంత సత్యవతి యాత్మగతంబున. 29

శా. ఔరా యీతఁడు పంకజాసనుఁడొ పద్మాక్షుండొ గౌరీశుఁడో
యీరూపంబున వచ్చి ముగ్ధ యగునా కిమ్మాడ్కిఁ గారుణ్యవి
స్తారుం డై రవిమంత్రరాజ ముపదేశం బారఁగాఁ జేసి యే
దారిం బోయెనొ యెట్లు గాంతునొ యిఁకం దత్ప్రాప్తి యింతేయొకో.

చ. అని శివయోగిపుంగవుని యం దతిభక్తి దలిర్ప నావనం
బున నొకజాము దా నిలిచి ఘూర్ణమనంబునఁ బ్రస్తుతించి సూ
ర్యునిఁ గని మ్రొక్కి యింక నిట నుండినచోఁ దలి దిట్టునంచు నా
దినము గృహంబు చేరి శివ దేవునిసన్నిధి కేఁగ మాని తాన్. 31

వ. అట్లు సేరి శివయోగీంద్రుఁ డిమ్మెయి నుపదేశించె నని యెఱిం జెప్పక తోడిబాలికలం గూడి యెప్పటియట్లాడుచుం బాడుకొంచుఁ బ్రతిదినంబును సిద్ధేశ్వరాలయంబునకుం బోయి శివునిఁ బూజించి మునివర్యుం డుపదేశించినమంత్రరాజంబు జపించుచు నుండె నొక్క నాఁడు. 32

సూర్యుఁడు ప్రత్యక్షుం డై సత్యవతికి వరమిచ్చుట.

సీ. గొజ్జంగిపూనీట మజ్జనం బాడి చెం
గావిపుట్టంబు చక్కంగఁ దాల్చి
తళుకొత్తుసొమ్ము లందంబుగఁ గై సేసి
కొని వేడ్క నెవరితోఁ గూడకుండ
మేడుగుపైఁ జేరి మహిమాఢ్యుఁ డగుశివ
యోగివర్యుని మది నొగి నుతించి
సౌరమంత్రంబును జపియించుచుండె దే
హంబును మఱచె భక్త్యతిశయమున

నప్పుఁ డెంతయు నాజల జాక్షి సేయు
జపమునకు మెచ్చి విప్రవేషంబు దాల్చి
వచ్చి రాసుతమ్రోల దివాకరుండు
నిలుచుటం జేసి దేహంబు దెలిసి యంత. 33

తే. భాసురామ్నాయరూపుని భద్రయశునిఁ
త్రిజగదారాధ్యు భవదూరు దివ్యయోగి
జనమనోంబుజవాసు సజ్జనవిలాసుఁ
జూచె విప్రోత్తముని బ్రేమలఁ జూడ్కి నెఱపి. 34

వ. అట్లు చూచి మనంబున నితం డర్కుండు విప్రరూపంబున వచ్చినవాఁ డని నిశ్చయించి సదమలభక్తిం గరపద్మంబులు మోడ్చి యిట్లు వినుతించె. 35

చ. వరనిగమస్వరూప మునివర్యమనోగృహదీప భూమిని
ర్జరగణసంతతాచరిత సంస్తుతినర్మకలాప శత్రుభీం
కరబహుళప్రతాప భవకల్మషసాగరశోష భక్తహృ
త్సరసిజవాస సర్వశుభసంశ్రయ దీనశరణ్య భాస్కరా. 36

చ. విమలయశోధ నాహృదయవృత్తమెఱుంగుట కిట్లు విప్రరూ
పము గొని వచ్చితో యిటకు బాలిశురా లగునాదు పూర్వపు
ణ్యముగద యుష్మదంఘ్రినలినద్వయిఁ జూచి నమస్కరించుటల్
సుమహితదేవవంద్య రిపుసూదన సత్కృపపూర్ణమానసా. 37

వ. అని యనేకవిధంబులం బ్రార్థించుసత్యవతి కమ్మాయాభూసురుం డనుకంపార్ద్రహృదయుం డై యిట్లనియె. 38

ధ్రువకోకిలవృత్తము.

నరవరేణ్యకుమారి మెచ్చితి నన్నుఁ గూర్చి దృఢాత్మ తం
బరమభక్తినుతింప నిమ్మయి బ్రాహ్మణాకృతి వచ్చితిన్
వరముగోరు మొసంగువాఁడ దివాకరుం డను నే ననన్
ధరణినాథకుమారి యూరక ధాత్రిఁ జూచుచు నుండఁగన్. 39

తే. అపుడు సత్యవతిం జూచి యంబుజాప్తుఁ
డనియె నోరాజకన్యక యాత్మ నుండు
వాంఛ నెఱిఁగింప కూరక వసుధఁ జూడ
నేల భవదీప్సితంబు నాకెఱుక యయ్యె. 40

వ. అని ప్రియం బార నాసత్యవతిహృదయాంబుజంబునం దనదివ్యతేజం బార ననుగ్రహించి వలసినయప్పుడు దర్శనం బొసంగి పోయెద నని వచించి సుఖం బుండు మని యంతర్హితుం డయ్యె నంత. 41

సీ. ఆసత్యవతి విస్మయం బంది యిమ్మేడ
కెవ్వఁడు రా నోపు నినుఁడు గాక
శివయోగివర్యుని చే నింత భాగ్యము
గంటిని లేకున్నఁ గాంతునొక్కొ
యంచు నాదిత్యునియం దనురాగం బె
సంగి పల్మాఱును సన్నుతించి
యీరహస్యం బెరి కెఱిఁగింపఁ గూడ దం
చెప్పటియట్ల తానెలమిఁ దోడి
బాలికారత్నములఁ గూడి భావ మలర
నాటలాడుచుఁ బాడుచు నాత్మయందు
నెపుడు శివయోగివరుని సిద్ధేశు నర్కుఁ
దలఁచుచును దల్లిదండ్రుల కెలమి నెఱపు. 42

వ. ఇవ్విధంబున నుండఁ గొన్నిదినంబులకు సత్యవతికి నాదిత్యునియం దత్యంతానురాగంబు గల్గుటం జేసి తదనుగ్రహంబునఁ జూలు దాల్చి జననీజనకుల కెఱుంగఁజేయ కొకవిధంబునఁ గాలంబు గడపుచుండు సమయంబున. 43

## వసంతర్తు వర్ణనము.

క. భాసిలెఁ బుష్పసుగంధా, వాసము మదచంచరీక వారస్వానో
ల్లాసము శుకపికబృంద, గ్రాసము మధుమాస మతిసు ఖవిలాసంబై.

కవిరాజవిరాజితము.

అరయ వసంతుఁడు వచ్చు నిఁ కిమ్ములి నాంబరము న్విడనాడి నవాం
బరము ధరించెద నందము గా నని భాసిల శ్రీవనకాంత మనో
హరముగ నమ్మొయిఁ దాల్చెనొ మేల్కనకాంబరమాశననందరుపుల్
సురుచిరపల్లవపుష్పచయంబుల శోభితమై తనరె న్వనిలోన్. 45

తే. చిత్రకుసుమావళులు పాకశత్రుచాప
దీప్తి ప్రసరించినట్లు ప్రదీప్త మగుచు
సురలతాగృహములమీఁద నొలయుగుచ్ఛ
ములు వనాంగనకుచయుగంబులుగ నొప్పె. 46

వ. అట్టిసమయంబున. 47

సీ. శారికాశుకపిక చయసద్రుతంబులు
భూరివాద్యవిశేషములుగ నొప్ప
భ్రమరసందోహస్వభావనాదంబులు
విమలగీతంబులై వేడ్కమీఱ
వికచనానాసుమప్రకరసంజనితగం
ధపరాగ మించుగంధపొడి గాఁగ
సత్పుష్పరసము వసంత మై తనరార
నరుణసుమావళి యగ్ని గాఁగ
సకలపరిపక్వఫలరసాసారధార
లాజ్యధారలు గా నెసలార సమద
భృంగసంతానబంధురశ్రేణి ధూమ
రేఖ లై వఱలంగ సంప్రీతి నపుడు. 48

క. వనకాంతామణికి వసం
తునకుం గుసుమాస్త్రుఁ డెలమితో నుద్వాహం
బొనరించె మంత్రతంత్రము
లనురాగము పుట్ట నుడివి యాచార్యుం డై. 49

వ. అట్టిమహోత్సవంబున నొకవనపాలిక సత్యవతికడకుం జని తాఁ దె
చ్చినయభినవామోదకుసుమంబులను బరిపక్వమధురఫలంబుల నొ
సంగి దండంబు లిడి యిట్లనియె. 50

సుగంధివృత్తము. అమ్మ నాదువిన్నపంబు నాలకింపు మిప్డు చి
త్రమ్ముగా వనమ్మునన్ లతాంతము ల్ఫలంబులున్

నెమ్మి మీఱి నెల్లచోట్ల నిండె దండి దానినిం
గొమ్మ రమ్మ తోడివారిఁ గూడి చూడ నెమ్మెయిన్. 51

వ. మఱియు నవ్వనంబు యాగశాలకైవడి సంతర్పణాహ్వానద్విజావళి యుక్తం బై బాలురవోలె వరవిహంగకృతమధురరుతిసమంచితం బై భూషణాలంకృతనర్తకుభాతి సంచలితకోమలలతాంచితకిసలయ సుమాన్వితం బై దానశీలునిమాడ్కి సర్వాభీష్టప్రదం బై యుండుఁ గావున. 52

తే. పోవుద మనంగ నారాజపుత్త్రి యపుడు
తోడిబాలికలును దల్లితోడ నుండు
పడఁతులును గూడి భూషణాంబరము లలరఁ
దాల్చి యౌవనపాలిక దారి చూప. 53

వ. పదపంకేరుహయుగహంసకంబులు గల్లని మ్రోయం బ్రమదవనప్రవేశంబు చేసి సఖీజనంబులం గూడి యచ్చట. 54

చెలులతోడ సత్యవతి వనవిహారము చేయుట

సీ. మల్లియపొదరిండ్ల మావిజొంపములఁ
దలిరులశయ్యల దనివి దీరఁ
జేరి యాడుచుఁ గొంత సేపు నెత్తావిపూ
గుత్తులు గోసి మూర్కొంచుఁ జెంత
ద్రాక్షపందిరులలోఁ దలముగఁ బండిన
పండ్లను మెసవుచుఁ బ్రాఁతిగాఁగ.
మ్రాఁకులపైఁ బ్రాఁకి మహింకి వ్రేలాడు తీ
వెలఁ బట్టి యుయ్యేల వలె నొనర్చి
యూఁగుచును బక్కపోఁకల నుండు పిట్ట
లఱవ విని వానిఁబోలె నొయ్యారముగను
బల్కులాడుచు లేళ్లను బట్టఁ బోవు
చక్కడక్కడ విహరించి యొక్కచోట. 55

## కమలాకర వర్ణనము.

ధ్రువకోకిలవృత్తము.
అరయఁ గాముని చేతిబాణములై పడంతుల నేఁచ నా
తురత దూఱెద రింత నేల మధుప్రసూదనునంఘ్రులం
బరఁగఁ జేరుద మంచు నాతనిఁ బ్రస్తుతించుచు నున్నవో
సరసిలో ననఁ బద్మవార మొసంగుఁ జక్కఁదనంబుతోన్. 56

చ. నను నెడఁబాయకుండఁ బ్రియనాథుఁడు గానక పోవుటే మొకో
యని రతి యెంచి మీరరిగి యాతనిఁ దెం డని పంప వచ్చి గ
న్గొనరె శరంబులార మన కూరిమిఱేని నటంచుఁ దేఁటు లి
ట్లనువుగఁ బద్మరాజిఁ గని యడ్గుచు నున్న వనంగ నింపుగన్. 57

తే. ఝంకృతులు సేయుఁ గమలకషాయగంధ
కలితశీతలపవనసంకులతరంగ
మాలికావృతపూర్ణ నైర్మల్యసలిల
యుక్తకాసారమును జూచి యుల్లసిలుచు. 58

పాదపవృత్తము. అందఱు హాయిగ నక్కొలనం బల్
పొందికమై డిగి పుష్పము లోలిం
గందుక మాడెదు రై వడిఁ బై నిం
పొందఁగ నొక్కరికొక్కరు వేడ్కన్. 59

ఆ. కోసి మేలమాడుకొంచు వేసికొను చం
దుండువిహగములను దోలు చాశ
దీర జలక మాడి రారయఁ దూండ్లకు
మెలఁగునంచ లనఁగ జలమునందు. 60

వ. ఇట్లు జలకమాడి గట్టున కేఁగి పుట్టంబులు గట్టుకొని రం దొకర్తు రాచపట్టికి వలువ చెలువారం గట్టఁబోవ దానికి నారాచపట్టి యిట్లనియె. 61

తరలవృత్తము. కట్టకుము బిగించి వలువ గాంత నడుము నంచు దాఁ
గుట్టు విడువకుండ నొడివెఁ గొంకు పొడమి యంత నేఁ

గట్టు వదలు గాన యొలమిఁ ఱగట్టెద నని గర్భ ము
న్నట్టిగుఱుతు లుండఁ గని మఱనంబుననుఁ దలంకుచున్. 62

క. ఈవింతఁ జూచితిరె ధా, త్రీవలయమునందు వింటిఱే యెప్రుడేనిఁ
భావింపఁ గన్యగర్భం, బై వఱలుట యువిదలారఱ యన నవ్వారల్.

తే. అబ్బురంపడి కన్నియఱకట్టు లుండఁ
గాంచి యిది యేమి మర్మం బఱటించుఁ గొంత
తడవు యోచించి మే మిట్టుఱ లడిగెద మని
జడియకుండఁగఁ జెప్పు మంఱచదుగ నపుడు. 64

సత్యవతి గర్భహేతువు చెలికత్తెలు పుణ్యవతికిం జెప్పుట.

వ. ఆరాజపుత్త్రి నభంబునం బ్రభాసితుం డగునాదిత్యుం జూచి శిరంబు వంచి భూమిం జూచుచుం బ్రత్యుత్తరంబు చెప్పనిదయ్యె నంత నా పడంతులు "కారణంవినానకార్య" మ్మనునార్యోక్తివలెఁ గారణంబు లేక కార్య మెప్పు డుండ దని తలంచి యూరక యడుగు టుచితంబు గా దని యక్కన్నియం దోడ్కొని వచ్చి మేడం జేర్చి పుణ్యవతి పాలికిం బోయి యందఱు దండంబు లిడి సత్యవతివృత్తాంతంబు దాఁపక యెఱింగించి మాయం దొకయపరాధం బుండెనేని దండింపుఁ డని యభయంబు వేఁడి రంత నాపుణ్యవతి సత్యవతికడకుం బోయి.

మత్తకోకిలము. చూలుచిన్నెలు గల్గి యుండఁగఁఱజూచి దానపు డాత్మ నే
నేల పుట్టితి నక్కటా యిలఱనిక్కమాఁదతకై వరా
లేల కోఁరితి దేవతావళిఱనెంచి బాపురె తొంటి నా
పాలిపాతకపుంజ మిట్టిక్రియఁఱ బట్టిమై జనియించెనో. 66

ఆ. ఏమిసేయుదానఱనీవింతచూలుకై
కారణంబు లేకఱకార్య మున్నె
యంచుఁ గూఁతుఁ జూచిఱ యాగ్రహావేశ మై
యడిగెఁ గఠినముగ భఱయంబు గదుర. 67

పంచచామరము. దురాత్మురాల చెప్పు మేరిఱతోడి మైత్రి గల్గెనీ
శిరంబు ద్రుంపఁ జేయుదానఁఱ జెప్పకున్నచోనిఁకా

దరింప నోప నిట్టితప్పుఁ దద్దయుం గృపాత్మతన్
ధరాతలంబునందు రాజ ధర్మ మారయం జెడన్. 68

సీ. చెలఁగు మాయక యిట్టి చిన్నె లెట్లొందును
గన్నెతనాన నిక్కంబు నుడువు
బాపురే లోకులు పాటింతురే నన్ను
నిట్టితప్పును మూసి పెట్ట మఱియు
ననరె లావున వంపు నగపడ జని దానఁ
జెడదె యశంబును జెడిప మాకు
నమృతాంబునిధి విషం బావిర్భవించిన
యట్లు పుట్టితివి హా యబ్జభవుఁడు
పూని కల్పించె నో నాకుఁ బుత్త్రిగాను
గడుపుచేటుగ నాయభాగ్యంబు నిట్లు
పుట్టుటం గూడ భగవంత పూర్వజన్మ
కర్మమో లేక యీవింత గల్గఁ గలదె. 69

వ. అని విచారంపడుచు ననేకభంగుల నడిగిన నాసత్యవతి శిరంబు వంచి భూమిం జూచుచు మాఱాడక యుండుటం జేసి మహోగ్రభాషల నిందించుచు వెండియు నిట్లనియె. 70

ఆ. వచ్చినట్టినింద చచ్చినఁ బోదిఁక
సిగ్గు మాని నాకుఁ జెప్పు మెల్ల
గరిడిముచ్చువోలెఁ గనులెత్తి చూడక
పల్కకుండు టేల పాడి తప్పి. 71

ఆ. కోడిగ్రుడ్డు గొట్ట గుండ్రాయి యేటికి
నంచు నేఁ దలంచి యడుగుచుండ
మిన్నకుండ లాభమున్నదె కానిమ్ము
కత్తిపాలు నీవు గను మనంగ. 72

వ. సత్యవతి యెట్టకేలకు జననిముఖం బాలోకించి యిట్లనియె. 73

క. చాలింపు తల్లి నాతో
నీలీలం బరుషభాష ♦ లేలాడెదో యి
క్కాలంబు వ్రాయి యెప్పటి
కోలిఁ మాటొండు నిల్చు ♦ నుర్వీస్థలిలోన్. 74

తే. ప్రియము పల్కినవారలఁ ♦ బెద్దలంద్రు
ప్రియము వల్కనివారలఁ ♦ బెద్ద లనరు
గానఁ బ్రియ మెప్డు పల్కంగ ♦ గౌరవంబు
గల్గుఁ గార్యము ప్రోడఁగూడుఁ ♦ గద ధరిత్రి. 75

వ. మఱియు నాకు జనయిత్రి వగుటం జేసి దురుక్తుల కెదురాడనోప
కూరకుండుదాన నిజంబు వక్కాణింతు నీఁక నూరకుండుమని
యి ట్లనియె. 76

క. అరయఁ బ్రపంచంబును దన
కరుణం బాలించునట్టి ♦ ఘనదైవం బి
క్కరణిం జేసెను వే ఱొక
నరునిం గానను నిజంబు ♦ నం దుండు దిలన్. 77

ఆ. పరఁగఁ బాముకాళ్లు ♦ పా మెఱుంగును నన్ను
గుట్టు చెప్పు మంచుఁ ♦ గొట్టఁ బోవఁ
దగునటమ్మ యెడఁదఁ ♦ దాలిమి నొందక
యాఱతాఱ లాడ ♦ నేల యనఁగ. 78

వ. అప్పుణ్యవతి సత్యవతివచనంబు లాకర్ణించి మనంబున కేమియుం
దోఁచక నింక నాథునికడకుం బోయి పుత్త్రికోదంతం బెల్ల నుడువ
నన్న రేంద్రుండు. 79

క. విని రౌద్రోద్రేకముచే
తను జాపవిముక్తశరవి♦ధంబున హస్తం
బున ఖడ్గము మెఱయఁగఁ జని
తనయాముఖం బారఁ జూచి ♦ తత్తఱపడుచున్. 80

వ. కట్టెదుట నిలిచి చంద్రహాసంబు జళిపించుచుం గులనాశకురాలా యని గద్దించి పిలిచి యిట్లనియె. 81

స్వాగవృత్తము. చంద్రవంశ్యమణి చారుయశుం డా
చంద్రగుప్తనృప చంద్రునితో భూ
మీంద్రు లంద ఱిల నీడె యటంచున్
సాంద్రకీర్తి తగ సన్నుతిసేయన్. 82

చంద్రగుప్తుండు పుత్త్రికగర్భకారణంబు విచారించుట.

మ. ధరణీపాలనఁ జేయుచుండుదు నితాంత శ్రీలఁ బెం పొంది భూ
సుర లాశీర్వచనంబు లియ్యఁగ క్షితీశు ల్మెచ్చ నిశ్చింతతో
నురుధర్మాచరణానుసారముగ నిత్యోత్సాహి నై శత్రుభీ
కర తేజోరతి నై సుబంధుతతి నై ఖ్యాతి న్మహీమండలిన్. 83

క. ఈరీతి నుండువానికి, గౌరవముం జెఱుప దుష్ట కార్యము భావం
బారంగఁ బూని చేసితె, నేరం బని తోఁపకుండ నెఱి నో దుష్టా. 84

తే. పాలవంటికులంబునం బరఁగఁ బుట్టి
యపయశంబును దెచ్చితి వధమురాల
తులసివనమున గంజాయి మొలక పొడమి
నట్లు కులఘాతుకీ నీకు నాత్మహితులు. 85

సీ. ఎవరు బోధించిరే యిట్టిదుర్బుద్ధి నా
కెఱిఁగింపు లే కున్న నిపుడు కత్తి
పాలు సేయుదుఁ జూడు గాలినమున్నుతోఁ
గాలనిమ న్నెట్లు గలయు నట్లు
కులము వాసిన వెన్క గూడుట సరిగాదు
చేసినతప్పును మూసి నిన్నుఁ
మన్నించినంతట నన్ను లోకులు మించి
దూఱక యుందురె దుష్టచరిత
కనుక నీగుట్టు చెప్పి నా కత్త్రివేటు
పోసఁగఁ దప్పించుకొను మెదఁ బుత్త్రియ నేడు

కరుణ సుంతైన నాకడఁ గానఁబడదు
కల్లలాడకు గర్భ మెక్కరణిఁ గల్గె. 86

క. అనిన విని సత్యవతి యో
జనకా నీ కొక్కనపయ శంబును నేఁ దె
చ్చినదానఁ గాను కోపా
గ్నిని ద్రోయకు మిడుతఁబోలెఁ గృపఁ గను నన్నున్. 87

సీ. సమధికక్షమచేత సకలకార్యంబులు
సమకూడు భూరియ శంబు గల్గు
గావునఁ గోపంబు గడు మేలు గా దని
విబుధులు చెప్పంగ వినవొ జనక
మఱియు ధర్మాధర్మ మార్గం బెఱింగిన
మానవేశ్వరుఁడవు మాన్యుఁడ విలఁ
గలుగుమర్మంబులు దెలిసినవాఁడవు
తప్పొండు లేదు నా తనువులోనఁ
దల్లిదండ్రులు మీరలే తప్పఁ బట్టి
యిల్లు వెడలింపఁ జేసిన నింక నన్ను
నింత గొప్పఁగఁ జూతురే యితరజనులు
పరుషభాషలు వల్కంగఁ బాడియగునె. 88

తే. కడఁగి కంఠీరవము మత్త గజముమీఁది
కుఱుకఁ దోఁడేలుమీఁదికి నుఱుకఁ గలదె
గౌరవము మాని యమ్మాయి ఘనపథంబు
మాని దుష్పథమున నించు కేని యేను. 89

వ. పోయినదానం గాను బుష్పింపనిపుష్పంబునకు భృంగంబు రా
నోప దనుధర్మం బెఱింగి నన్ను రక్షింపు మని వెండియు నిట్లనియె.

క. మఱి కన్నియ చూలొందుట
యొఱగొడ్డియ మంచు నెంచి యున్న రనుచు న

న్నతిముఖిఁ బీడింపఁగ వల
దెఱిఁగించెద దైవమహిమ । యిది విను జనకా. 91

క. తొలిఁ గుంతికి నాదిత్యుం, డెలమిం జూలొందఁ జేసె । నేర్పడ నాక
ట్లలరెం గావున నే నిలఁ, గులనాశకురాలు గాను । కోపం బేలా. 92

ఆ. కల్లలాడుదు నని । కలలోనఁ దలఁపకుఁ
గన్ను పోవునట్టి । కాటుకేల
బాస యెద్ది యేని । చేసెద నుగ్రము
సత్య మెఱుఁగ వచ్చు । జగతిజనక. 93

వ. కావున నూరక పీడింప నేల యనెడుకూఁతుం జూచి కొంతతడవు మనంబున నాలోచించి చంద్రగుప్తుం డిట్లనియె. 94

క. ఇప్పుడు సెప్పినమాటను
దప్పకుఁ జేయింతు నిపుడు । దగఁ గోవిదు లే
చొప్పున వ్రాక్రుచ్చెద రా
చొప్పున లేకున్నఁ ద్రుంతుఁ । జొప్పడ శిరమున్. 95

వ. మఱియు రాజేంద్రుండ నయ్యు నిట్టిరహస్యం బేను వెల్లడిసేయకున్న నన్ను నెల్లరు నిందింతు రని వక్కాణించి కొల్వుకూటంబున కేఁగి చాతుర్వర్ణ్యంబును రావించి నయసంపన్నత మెఱయ ని ట్లనియె.

ఉ. వింటిరె యెప్పుడేని మన । వృద్ధులు సెప్పఁగ మీరు గాని క
న్గొంటిరె కన్నెచూ లగుట । క్రొత్తగఁ గంటిన యిప్డు కూఁతునం
దింట నెసంగి యున్న దది । యేరికిఁ జెప్పక డాఁచిపెట్ట నా
కంటె నసత్యవంతుఁ డిఁకఁ । గన్పడఁ డే నృపుఁ డయ్యు నిమ్మహిన్.

మ. అనరే లోకులు పక్షపాతి యని న । న్నడ్డొందు లేకుండ దా
నన నాఖ్యాతి దొలంగదే జనము ల । న్న్యాయాన్వితు ల్గారె న
న్ననరే చుల్కఁగ భృత్యవర్గ మొగి నా । కం బెట్లు నన్పొందు న
జ్జనముల్ మిత్రులు బాంధవుల్ నగరె దు । శ్చారిత్రుఁ డంచు న్ధరన్.

వ. కావున నాపుత్రి కన్యక యయ్యు నంతర్వత్ని యగుటం జేసి యది యెఱింగి తదుదంతం బడిగి దండింప నావలన నొకయపరాధంబు

లే దంచుఁ గుంతి కాదిత్యుండు కరుణించిన ట్లయ్యె నని వచియించె
నంత. 99

తే. కల్ల లాడకు మని యేను గనలి వల్క
నపుడు కొండొకతడవున కనిమె జనక
సందియం బేల నాచేత సరవి నెద్ది
యేని బాసను జేయించి యెఱుఁగు నిజము. 100

వ. అని వల్కుటం జేసి విని సజ్జనంబుల కియ్యది యెఱింగించి వా రానతి
చ్చిన ట్లొనరించు టుచితం బని తలంచి యెఱింగించితిఁ గావున. 101

తే. రాజపుత్త్రి యటంచు గౌరవము గనక
యిప్పు డాదుష్టురాలిని నిటకుఁ బిల్చి
గర్భకారణ మడుగుఁడు కరుణ మాని
యెల్లవారలు చూడంగ నేవు మీఱ. 102

తే. బాస చేసెదనని తాను బల్కెనేని
పూని చెప్పుఁడు కఠినము గాను బాస
సందియము మానునట్లుగ జనులు సత్య
వంతుఁ డనఁగఁ గులానికిఁ గాంతి యెసఁగ. 103

తే. తనయ ముద్దైనఁ జేసిన తప్పు ముద్దె
గూఁతు రని యూరకుండినఁ గులము సెడదె
బాపురే తొల్లి చేసిన పాపఫలము
గాక వే ఱొండు గల్గుట గలదె జగతి. 104

విజయసేనుని చరిత్రము.

వ. తొల్లి కుకురుదేశాధిపతి తనకుమారుండు చేసినదుష్కార్యంబు
నకుఁ బుత్త్రుం డని కరుణింపక శిక్షించె ననిన విని సభ్యు లదెట్లు
ని యడుగఁగాఁ జంద్రగుప్తుం డిట్లనియె. 105

సీ. వినుఁ డాకుకురుపతి వీరసేనుం డను
నరపతి కొక్కఁడ నందనుండు
విజయసేనుం డని వీరుఁడై యతఁ డొక్క
నాఁడు శృంగార వర్ణనంబునకును

బోయి యం దొక్కెడఁ బూర్ణఫలంబులం
  గ్రాలురసాలవృక్షంబుఁ జూచి
ఫలములు గోయంగ భటునితోఁ జెప్ప నా
  భటుఁ డిట్టు లనియె నోప్రభువరేణ్య
పండ్లు గోయఁ జాలఁ బరికింప నీవృక్ష
మంతరిక్షమునకు నంటి యున్న
దంచు భీతి నొంది యనఁగ నాభూపతి
పుత్త్రుఁ డధికకోప మునఁ గడంగి. 106

తరళవృత్తము. తనయభీశ్వరుఁ డానతిచ్చినదాని మానక సేయు వా
నిని భటుం డనవచ్చు నెమ్మెయి నీవు నీ పలు కేల కా
దని వచించితి వెంతగర్వ మిఁక గంత పోవును జూడరా
యని చెవిం దనకత్తిఁ గోసె నయారె నెత్తురు గాఱఁగన్. 107

వ. అంత నాసేవకుండు కర్ణబాధ కోపక పుడమియందు మైమఱచి వ్రా
లి కొంతతడవునకు లేచి నలుదెసలం గలయం జూచి వికృతకర్ణుం
డై రక్తధార లొలుక విజయసేనునితండ్రిపాలికిం బోయి దండంబు
లిడి యి ట్లనియె. 108

క. ఓరాజవర్య యిమ్మెయి
నూరక తప్పొందుపెట్టి యురుకోపముతో
ధీరుం డగుభవదీయ కు
మారుఁడు కర్ణంబు గోసె మల్లడి గొనఁగన్. 109

వ. అట్లు గోసి యెటకేనియుం బోయె భవదాత్మజుం డగుటం జేసి శి
క్షింపుఁ డని చెప్ప నోప ననిన విని యవ్వీరసేనుం డాసేవకుని నూర
డించి కూర్చుండఁ బెట్టికొని యాసేవకు నెదుటఁ దనకుమారుని రా
లించి నిలువం బెట్టి సభాసదులు చూడ ని ట్లనియె. 110

క. తనశక్తికి మించినపనిఁ, గాని సేయనిభృత్యు నిట్లు గోయం దగునే
ఘనకల్మషాత్మ నీ వొక, తనయుండవె ఘాతుకుండ ధర్మవిరోధీ. 111

తే. తనయుఁ డంచును జేసిన తప్పు మాపి
వదలిన స్త్రైన లోకులు వంచకుఁ డని
పాడి తప్పినవాఁ డని పలువిధముల
దూఱుదురు దాన నాకీర్తి తొలఁగిపోవు. 112

వ. మఱియు సేవకుఁని బుత్త్రింబోలెఁ జూడం దగు నిట్టియకృత్యంబు
కడంగి యెఱుకువాని తెలుంగునం జేసితి విట్టియపరాధనంబున కేమి
సెప్పెద వని యడుగ నవ్వీజయసేనుండు శిరంబు వంచి మాఱాడ
కుండుటం జేసి జనకుం డిట్లనియె. 113

తే. ప్రముచ్చిలితి నంచు నెరులకు వచ్చి నుడువు
వాఁడు గలఁడె ధరిత్రి నవ్వగను దప్పు
చేయుటం జేసి నాతోడఁ జెప్ప వెఱచి
మిన్నకుండెదు సాక్ష్య మీ మీఁద నేల. 114

వ. అని కోపోద్రేకంబున వికృతకర్ణుఁ డై యుండు సేవకునిం బిల్చి నీచె
విం గోసినమాడ్కి వీనిచెవి గోయు మని చెప్ప నాభటుండు భయం
పడి యూరకుండుటం జేసి తనకరవాలంబునం గుమారునిచెవిం
గోసినవాఁ డయ్యెఁ గావున. 115

ఉ. చెప్పుఁడు బాస నాతనయ చే నొనరించెద నెట్టిదైన మీ
రిప్పు డనంగ వార లిది యేమివిచిత్రము మొన్న కన్నె యే
చొప్పునఁ జూలు దాల్చె నిది చూడఁగఁ గారణ మేదియో యొకం
డొప్పుడునైనఁ బుత్త్రి యని యుల్లమునం గృప మానఁ బాడియే.

చ. అని తలపోసి యిప్పుడు ధరాధిపుఁ డెమ్మెయిఁ బల్కె నమ్మెయిం
గని పలుకంగ మే లెసఁగుఁ గా దని పల్కిన నెల్లవారు దు
ర్గను లని యెంచి కోపపడు సాజము తేండ్లకు నిట్టిబుద్ధి గా
వునఁ దగుమాట లాడవలె నూరకయుంట ఫలంబు లే దిఁకన్. 117

తే. అనుచుఁ బల్కిరి యిమ్మెయి నవనినాథ
చెలఁగు మాయక చూలగు తెలఁగు మేము.

విన్నదియుఁ గన్నదియు లేదు ƒ విన్నవార
మయ్య మీమాట యీవింత ƒ యరుదుగాదె. 118

సీ. వ్రతదానములు చేసి ƒ సుతఁ గాంచితివి సుధాం
బుధివంటికులము పెం ƒ పొందఁ గోరి
కడకు నీవిధ మయ్యెఁ ƒ గడు భవద్విఖ్యాతి
కూన మై రాజేంద్ర ƒ యుర్వినిట్టి
గుట్టు డాఁచితివేని ƒ కోటిడం బొనరింతు
రెల్ల జనంబులుఁ ƒ దెల్లమిగను
గనుక నేదేని బా ƒ సను జేయు మని దాని
నిజము గాంచుట మేలు ƒ నెఱి దనర్ప
నపుడు లోకులు కడు మెచ్చి ƒ యనరె "యౌర
మననరేంద్రుండు ధర్మంబు ƒ మానకుండఁ
దనకుమారిత చేసిన ƒ తప్పిదమును
మూసివెట్టక దండించె ƒ బాసవలన. 119

సీ. తగ 'యథా రాజా తథా ప్రజా' యనునార్య
వచనంబుభంగి భూ ƒ వరుఁడు వినఁగఁ
జొప్పడ సభ్యులు ƒ సెప్పఁగ నాలించి
బాపురే యేమి నా ƒ భాగ్య మంచు
నెంతయుఁ జింతించి ƒ యిది యేదియో యొక
విపరీతహేతువ ƒ వేఱు గా ద
టంచు మనంబున ƒ నెంచి కాఁ గలకార్య
మగు దీని కూరక ƒ వగవనేల
యని దృఢాత్ముఁ డగుచు ƒ నంతఁ జారునిఁ బిల్చి
పోయి దుష్టమైన ƒ పుత్త్రి నిటకుఁ
గొంకు మాని తోడు ƒ కొని రమ్ము పొమ్మని
పల్క నేఁగి పుణ్య ƒ వతి కెఱింగి. 120

వ. రాజునానతి నుడివి సత్యవతిం బంపు మని యమగుటంజేసి పుణ్యవతీ
దేవి భయభ్రాంతచిత్త యై యిట్లు చింతించె. 121

ఉత్సాహవృత్తము. భూరికోపమానసమునఁ బోయి ప్రాణనాథుతోఁ
నోరు పింతయేని లేక యుగ్రవృత్తి నక్కటా
యీరహస్య మేను డాఁప కేల చెప్పితిం బ్రియం
బారఁ బుత్త్రిపై యటంచు నాత్మ నెంచ కిమ్మెయిన్. 122

ఆ. చూలు గల దటంచుఁ జూడక యిప్పుడు
మ్రోల నిల్పి కత్తిఁ బాలు సేయఁ
దలఁచె నొక్కొ లేక దండించి యెట కేని
నుసల కేఁగు మంచు ననుపునొక్కొ. 123

వ. మఱి యిట్టిసమయంబునం బ్రాణనాథుపాలికిం బోయి పుత్త్రిని ర
క్షింపు మని వేఁడు టుచితంబు గాదిఁ కేమి సేయుదు నని కూఁతుక
డకుం జని యిట్లనియె. 124

తే. సత్యవతి యేల పుట్టితె సభకుఁ బోయి
నిలుచునట్లుగ నాగర్భ నిరయమందు
నక్కటా పొమ్ము జనకుని యాజ్ఞసరణి
ననుడు నక్కన్య జననితో ననియె నిట్లు. 125

తోదకవృత్తము. ఇంతకు నాఫల మిట్టుల యుండం
గాంతురె మీ రను కంపముతో న
త్యంతప్రియమ్మున హైమవతీశుం
డంతటి కుండ భయంపడ నేలా. 126

క. పుట్టించినభగవంతుఁడు
గిట్టింపఁడె యెప్పుడేని క్లేశం బేలా
పట్టుగ నాజనకుఁడు తలఁ
గొట్టించిన మేలె కొలువు కూటములోనన్. 127

తరళవృత్తము. కడుపుచేటుగఁ బుట్టి తం చను కంపవృత్తిఁ దొఱంగి న
న్గడకు నిమ్మెయిఁ జేసి తీవు నికారమే ర్పడ నైననీ

కడుపుఁ గన్న ఋణంబు దీర్పక ♦ క్రచ్ఛఱం జనఁ బాడిగా
దిడుదు దండము లాబుణంబున ♦ కీడు గాఁగను నాయెడన్. 128

వ. ఇప్పటి క్షేమ ముండు మని చెప్పి చారుని వెన్నడి బాలహంసగమ నంబుభంగి మందగమనంబునం దండ్రిపాలికిం బోయి యొక్కెడ నిలుచుటం జూచి జనకుండు. 129

{గర్భవతి యగుసత్యవతిని జంద్రగుప్తుండు కాఁతు రని కరుణింపక కొలువుకూటమునకు రప్పించుట.}

క. ఓసికులాధమురాలా, చేసినపని డాఁపకుండఁ ♦ జెప్పుము వినుచ
ట్లీసభ వారికి నన విని, యాసత్యవతీనలామ ♦ యతిభక్తి మెయిన్. 130

తే. ఆసమాజంబునుం జూచి ♦ యయ్యలార
వినుఁడు కరుణించి వేషంబు ♦ వేసితేని
యాడకే యూరకుండ నె ♦ ట్లగు నటంచు
మొక్కి లిడి వక్కి నిమ్మోయి ♦ మొనసి యపుడు. 131

తే. ఎద్దుపుం డెప్డుఁగాకికి ♦ ముద్దుగాదు
నెమలికన్నీరు వేఁటకా ♦ నికి నిజంబు
గాదు నాగుట్టు సెప్పినఁ ♦ గాని సత్య
మని వచింతురె లోకులు ♦ విని ముదమున. 132

క. వనరుహమిత్రుననుగ్రహ
మున నిమ్మోయిఁ గల్గె నన్య ♦ మ్ముం గానను న
న్గని యింకఁ జెప్పఁ డోకభా
సను దప్పక చేయు దాన ♦ సత్యము మెఱయన్. 133

వ. అని ధైర్యంబునం బల్కు రాజపుత్త్రిం జూచి యాసామాజికులు విస్మయపరీతచేతస్కులై యిట్లనికొనిరి. 134

సీ. మనము రాజేంద్రుని ♦ మానసం బేరీతిఁ
గల దట్లు వచియింపఁ ♦ గలమె బాస
ననువారు మఱికొంద ♦ ఱాయీశ్వరునిమాయ
గాని దీనికేఁ జెప్పఁ ♦ గలమె బాస

ననువారు కొందఱు మనకేల యేనింద
గనుచుండ మూరక ఘనత మెఱయ
ననువారు మఱికొంద ఱాశ్చర్యపడి కన్నె
చూ లెట్లు దాల్చును జోద్య మిదియు
ననెడువా రింత కీకన్నె యందు సత్య
మున్న చో బాస యేదేని యొనరఁ జేయు
ననెడువా రందుఁ గొంద ఱయ్యబల బాస
చేయనోపునె యీచూలు చేఁ గడంగి. 135

వ. మఱియు సూర్యానుగ్రహంబున నిట్లయ్యె నని వచియించె నది సత్యం
బని తలంప నగునే యని పలువిధంబులం బల్కుచుండి రప్పు డాస
భాంతరాళంబున నర్కుండు వృద్ధభూసురవేషంబు ధరియించి యుం
డి మెల్లఁగ లేచి చంద్రగుప్తునిఁ జూచి యిట్లనియె. 136

తే. వినుము నరనాథ యెవనిచే వెలుఁగు నుజ్జ
గంబు లెవ్వానివలన సస్యవ్రజంబు
వాయు వెవ్వనికృప వృద్ధివడయు జీవ
రాసు లెవ్వనిచే వేదరాశి వఱలు. 147

వ. మఱియు నయ్యీశ్వరుండు సర్వకాలంబుల సమస్తదేశంబుల సర్వావ
స్థల సకలవస్తువుల దశదిశల నాశ్రమంబుల బహిర్వ్యాప్తుండై సర్వ
తోముఖుం డనం బరఁగు నయ్యనఘుండ సత్యజ్ఞానానంద పరబ్రహ్మం
బు ప్రభావం బిత్తెఱంగునం బ్రకాశించు నని వెండియు నిట్లనియె.

ఆ. వేషధారి యొకఁడ వివిధవేషంబులు
దాల్చి వింతగా సదస్సునందు
నాడినట్లు వెలుఁగునా పరబ్రహ్మ మి
ట్లవని యెల్లవారియందు నెపుడు. 139

వ. అదియునుం గాక. 140

తే. వినుము యువకేతుఁ డను యోగి వీర్యసంయు
తోదకము ద్రాగి తొలి బాల యొర్తు చూలుఁ

డాల్చె నిబ్భంగి మఱి యిట్లు తా విభాండ
కుండు మృగమున ఋశ్యశృంగునిఁ గనండె. 141

క. అనిలుం డూరక యంజన
యనుదానిం గనినకతన హనుమంతుఁడు పు
ట్టెను బాహుబలయుతుం డై
ఘనత వహింపఁడె యతండు కపివర్యుం డై. 142

వ. మఱియు నరుణాశ్వుం డను రాజపుత్త్రుఁ డగు యువనాశ్వుండు పుత్త్రి
లు లేమిం జేసి భూదేవోత్తములవలన నింద్రయాగం బొనరించుచుండి
దీక్షామధ్యకాలంబున నొక్కనాఁటి రేయి తనకుఁ గడుదప్పి యగుటం
జేసి యచ్చట నారాధింపఁబడినయింద్రకలశోదకంబు ద్రావె నంత
నయ్యువనాశ్వునకు గర్భం బావిర్భవించి మాంధాత జనించె నిది
యునుం గాక. 143

సీ. ఉత్పలావతి యను యువతిని దొల్లిని
ర్వృతిచక్షుఁ డనుముని మృగము గమ్మ
టంచు శాపం బిచ్చె నాశాపమును బొంది
మృగముగ నడవిలో మెలఁగుచుండ
నొకనాఁడు వేఁటాడుటకు సురాష్ట్రమహీత
లేంద్రుఁ డయ్యడవికి నేఁగి యచట
శాపాన్వితమృగంబు సంచరించుటఁ జేసి
పట్టఁ జూచిన నది పట్టువడక
యేఁగునప్పుడు తనదేహ మొసఁగ దానిఁ
దాఁకుటం జేసి చూలొంది తామసుఁ డను
మనువు నాల్గవవానిని గనె ధరిత్రి
నరయ దేవమహర్షుల వరము లెపుడు. 144

క. సరవిగఁ బొందినవారలు
పరికింపఁగ నెద్దియేని వడయుట యరుదే

ధరణీశ్వర యట్లొకవర
మొఱవిమం గొని చూలు దాల్చి యుండదె చూడన్. 145

వ. కావున నిబ్బాలికయందు సత్కృత్యం బున్న దని తలంచితివేని దీనిచే నొకయుగ్రప్రమాణంబు చేయించి నిజంబు గను మూర కిందుఁ జూలాలిని నిలువఁబెట్ట నేల యనిన విని రాజేంద్రుఁ డావృద్ధభూసురేంద్రున కిట్లనియె. 146

తే. ధారుణీనిర్జరోత్తమ తగినబాస
నీవ చెప్పుము యోచించి నేర్పెసంగ
నిపుడ చేయింతు సందియ మెఱుఁగ నిందు
నంద ఱొగిఁ జూడ నన విప్రుఁ డనియె నిట్లు. 147

మాయావిప్రుం డగు సూర్యుఁడు చంద్రగుప్తునకుఁ ప్రమాణవిధ మెఱింగించుట.

సీ. క్రూరోరగంబును గుదురుచుట్టగఁ జేసి
తలమీఁద నిడుకొని దానియందుఁ
గుమ్మరసారెనుగోసి యెత్తినపచ్చి
కుండనిండుగఁ గల్లు మెండు పోసి
కల్లొల్కకుండఁ జక్కఁగ నుడివెడుత్రోవఁ
జనుచు భారం బని మొనసి నేల
డించక యొండేని యించుక కూర్చుండి
పోదమం చనక యంభోజమిత్రుఁ
డస్తమింపక మున్న ప్రశస్తమైన
రమ్యకాంభోజపురి కుత్తరమునఁ దురగ
పర్వతము తూర్పునందు సీపట్టణమున
కోలి దక్షిణదిశయందు నుండునట్టి 148

తే. సర్వపావనిభాస్కర శైవలినికి
నుత్తరప్రాంతమున విశాలోర్వి బరఁగు

వృద్ధగాలవవృక్షంబు క్రింద నిడఁగ
వలయు నట్లిడ నిజవృత్తి వఱలు జగతి. 149

వ. మఱియు నీప్రమాణంబు పరీక్షింప నీవు పరివారంబుతో నరుగుచు "నీ
చూలా లెందేని తల నుండుభాండంబును డించునేని యప్పుడ దాని
శిరంబు ఖండింపు మని ప్రమాణలక్షణంబు నుడువ రాజేంద్రుఁ డా
కర్ణించి యియ్యది తగుభాస యని వచించి కూఁతుం జూచియిట్లనియె.

చ. క్రమముగ వింటె భూసురశిఖామణి చెప్పినదెల్ల నట్లు సే
యుము కులహీనురాల మఱియొక్కటి వేఁడిన నొప్పు నింక న
క్కమలభవుండు సత్కరుణఁ గావఁగ వచ్చినఁ గాని నీదున
త్యము పరికింపఁ గావలయు నందఱు మే లని మెచ్చునట్లుగన్. 150

క. అని చెప్పిన నక్కన్నియ
విని జనకునిఁ జూచి యిప్డు వృద్ధుం డీస
జ్జనములు వినఁ జెప్పినభా
సను జేయుదు వేఱ యడుగ సత్యము తండ్రీ. 151

క. పలుతెఱఁగుల నగ్గని లో
కులు దూఱఁగ నుసురు వెట్టి కొని యిఁక నీభూ
తలమున నుండఁగ వలయునె
కులనాశకురా లనంగ గుణువర వింటే. 152

చ. దొరఁకొని ఱోటిలోనఁ దలఁ దూఱిచి రోఁకటిపోటుఁ జూచి నే
వెర వఱి భీతి నొందఁగనె వీడునె వచ్చినబాధ తండ్రి నే
నరవిఁ బినాకినీనదిని స్నానము సేయఁగ నానతి మ్మటం
చురుతరభక్తి వేఁడుసుతఁ నొప్పుగఁ జూచి నరేంద్రుఁ డిట్లనున్.

ఆ. స్నానమేల నీకుఁ జనకు మియ్యెడఁ బాసి
యనఁగ సత్యవతి ప్రియంబు గదర
ననియెఁ దండ్రి యెందు నరుగ నాసిద్ధేశుఁ
బూజ సేయుకొఱకుఁ బోయి వత్తు. 154

తే. అనిన విని కూఁతుఁ జూచి యిట్లనియె దుష్ట
చేయరానట్టికార్యంబు చేసి శివుని

పూజ యొక్కటి సేయక । పోయినందు
వలన మిక్కిలితక్కువె । తలఁప నిపుడు. 155

వ. మఱియు నీపూజనెపంబున నెందేని పోఁ దలంచినదానవు కాంబోలు నిఁకఁ బూజ గీజ యని పో నఃుగ వలనదూరకుండు మనిన నాసత్యవతి యాకర్ణించి జనకునిచరణారవిందంబుల వ్రాలి యిట్లనియె.

ఆ. జనక బాసచేసి । సత్యం బెఱింగింతుఁ
గాని యూరకేల । లేని పోని
మాటలాడె దేల । మఱి పూజనెపమున
నెటకుఁ బోయె దంచు । నిట్లు వలుక. 157

వ. ధర్మంబు గాదు“సత్యమేవజయతి నానృత”మ్మనునార్యోక్తివలె సత్యమే జయించు నసత్యంబు జయింపదు గావున నిప్పటికి నించుక కరుణించి సిద్ధేశు నారాధింపఁ బంపు మెటకేనియుం బోక యిప్పుడవత్తు నానిజం బాకింత పరికింపు మని ప్రార్థించుపుత్త్రి కమ్మోయిం జంద్రగుప్తుం డానతిచ్చె నంత. 158

—••◆ ఆశ్వాసాంతములు. ◆••—

క. సుజనకుముదాళిరాకా, రజనికరా! సమదదుష్ట । రాక్షసహరణా
వృజినావళిప్రశోషణ, రజతాచలసదన భోగి । రాజాభరణా. 159

మాలినీవృత్తము. ప్రవిమలగుణధామా । భక్తలోకైకసీమా
భవదురితవినాశా । భవ్యమూర్తి గిరీశా
దివిజవినుతపాదా । దీనరక్షానుమోదా
కవిజననుతిలోలా । కామితార్థానుకూలా. 160

—••◆ గద్యము. ◆••—

ఇది శ్రీమదాలూరువంశపయోధిరాకామృగాంక రామ
కృష్ణదైవజ్ఞపుత్త్రి సుజనవిధేయ వాసుదేవనామ
ధేయప్రణీతం బైన శ్రీసిద్ధేశ్వరీయం
బను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.
సంపూర్ణము.



శ్రీ ర స్తు.

శ్రీగణేశాయనమః.

# శ్రీ సిద్ధేశ్వరీయము.

## తృతీయాశ్వాసము.



శ్రీ మద్గంగాధర సు
త్రామార్చితపాదయుగళ ధనపతిమిత్రా
భూమీధ్రచాప కామా
క్షీమానసపద్మభృంగ శ్రీసిద్ధేశా. 1

తే. అవధరింపుఁడు మునులార యంత సత్య
వతి పినాకిని కేఁగి పావనజలంబు
లందు స్నానంబుసేసియు నార్ద్రవస్త్ర
మును ధరించి శివాలయమ్మునకుఁ బోయి. 2

వ. ఆసిద్ధలింగేశ్వరుని సభక్తికస్వాంతంబునం బుష్పములం బూజించి దండప్రణామంబు లాచరించి యంజలి ఘటియించి యిట్లు ప్రార్థించె.

సత్యవతి సిద్ధేశ్వరుని స్తుతించుట.

సీ. జయ పరమేశ సజ్జనహృదయోల్లాస
హార మహాదేవ మహానుభావ
సుకృతకర్మకలాప సురమహీధరచాప
దళితదైత్యకలాప ధవళరూప

కామితమందార కారుణ్యసాగర
వరభక్తహృదయని వాస యీశ
కరిచర్మవసన దుఃఖార్ణవశోషణ
కలుషకాననవహ్ని కామహరణ
ఫాలకుముదాప్తమౌళి కపాలధారి
ప్రమథనాథ విపద్బృహద్భాను మేఘ
దక్షమఖభంగ మౌనిహృదబ్జభృంగ
సిద్ధవటపురీధామ శ్రీసిద్ధలింగ. 4

ఉ. బాసను జేయు మంచు ననుఁ బాములు వెట్టఁ దలంచెఁ దండ్రి న
న్నీసమయంబునన్ మనుపు మీశ్వర యే నొకదుష్టకార్యముం
జేసినదానఁ గా నటులు సేసిన నీవ దెలుంగ కుందువే
భాసురమంగళాంగ రిపుభంజన దీనదయాత్మ శంకరా. 5

ఉ. బాసట లేదు నాకు నిల బాంధవు లొక్కరుఁ దల్లిదండ్రు లి
ట్లోసరిలంగఁ జేసిరి మఱొక్కరు రమ్మని పిల్వరో బృహ
ద్భానుమయాక్ష నన్నికఁ గృపామతు లెవ్వరు గాచువారు సం
త్రాసముఁ గూర్చువా రెవరు ధూర్జటి యొక్కఁడ వీవు దక్కఁగన్.

పాదపవృత్తము. పాయక కాలుని పాశముతో డం
బోయి భువిం బడఁ బోయినమార్కం
డేయునిఁ బ్రోచిన యీశ్వర నన్నుఁ
ట్లీమెడఁ గావు ముమేశ గిరీశా. 7

తే. రావణుఁడు తొల్లి గర్వించి రజతగిరిని
బంతివలె నెత్తి యాడించె భయము మాని
కడపటను వాఁడు పొగడంగఁ గరుణ గల్గి
గాచితివిగాదె యమ్మెయిఁ గావు మయ్య. 8

క. మును బాణాసురుఁ డెలమిం
గొనియాడఁగ వాని వేఁడికోలునకు ముదం

కామితమందార కారుణ్యసాగర
 వరభక్తహృదయనివాస యీశ
కరిచర్మవసన దురఘార్ణవశోషణ
 కలుషకాననవహ్ని కామహరణ
ఫాలకుముదాప్తమౌళి కపాలధారి
ప్రమథనాథ విపద్గ్రహోద్భానుమేఘ
దక్షమఖభంగ మానిహృదబ్జభృంగ
సిద్ధవటపురీధామ శ్రీసిద్ధలింగ. 4

ఉ. ఘాసను జేయు మంచు ననుఁ బాములు వెట్టఁ దలంచెఁ దండ్రి న
న్నీసమయంబునన్ మనుపురీశ్వర యే నొకదుష్టకార్యముం
జేసినదానఁ గా నటులు సేసిన నీ వెఱుంగ కుందువే
భాసురమంగళాంగ రిపుభంజన దీనదయాత్మ శంకరా. 5

ఉ. ఘాసట లేదు నాకు నిల బాంధవు లొక్కరుఁ దల్లిదండ్రు లి
ట్లోసరిలంగఁ జేసిరి మఱొక్కరు రమ్మని పిల్వరో బృహ
ద్భానుమయాక్ష నన్నిఁకఁ గృపామతు లెవ్వరు గాచువారు సం
త్రాసముఁ గూర్చువా రెవరు ధూర్జటి యొక్కఁడ వీవు దక్కఁగన్.

పాదపవృత్తము. పాయక కాలుని పాశముతోడం
బోయి భువిం బడఁ బోయినమార్కం
డేయునిఁ బ్రోచిన యీశ్వర నన్నుఁ
ట్లీమెడఁ గావు ముమేశ గిరీశా. 7

తే. రావణుఁడు తొల్లి గర్వించి రజతగిరిని
బంతివలె నెత్తి యాడించె భయము మాని
కడపటను వాఁడు పొగడంగఁ గరుణ గల్గి
గాచితివిగాదె యమ్మెయిఁ గావు మయ్య. 8

క. మును బాణాసురుఁ డెలమిం
గొనియాడఁగ వాని వేఁడికోలునకు ముదం

పాహి బుధహృన్నివేశ కృపాంబురాశి
పాహి భూసురవేష దుర్భయవినాశ. 14

సీ. నానాఁడు నీదర్శనంబు లేకుండిన
మానవు లెమ్మోయి మనుదు రిలను
నానాఁడు నీదర్శనము సేయకుండిన
మానవులకు ముక్తిమార్గ మెట్లు
నానాఁడు నీదర్శనము సేయుచున్నచో
మానవు లొందరే మహితగతులు
నానాఁడు నీదర్శనము జీవనము ప్రాణి
కోట్లకు వేఱెద్ది కుముదవైరి
కర్మసాక్షి దినేశ సుఖప్రదాత
సర్వరిపుకుముదానీకసారసాప్త
దివ్యతేజోవిరాజిత దేవదేవ
సమయ మిది ప్రోచుటకుఁ బ్రశస్తస్వభావ. 15

వ. మఱియు నీపంచాశత్కోటియోజనవిస్తీర్ణం బగుభూమండలి న
హోరాత్రంబులయందు ఛందోమయాశ్వహేషలు నుభయపా
ర్శ్వంబుల న్మాఠరపింగళాదులధ్వనులును జెలంగ వాలఖిల్యాది
మునిసత్తములు ఋగ్యజురుక్తసౌరమంత్రంబులఁ బఠింప జాయా
రత్నం బగుఛాయాదేవిం గూడి యేకచక్రాన్విత శతాంగారూఢుం
డై సంచరించుచుం ద్రిలోకబాంధవుం డని పేర్కొన్న నిన్నుం బ్రస్తు
తింప నాదిభోగీంద్రునకుఁ దరంబు గాదు గావున. 16

తే. మ్రొక్కెదను భాస్కరా యిదె యొక్క మొక్కు
పెక్కు మ్రొక్కులుగా నెంచి ప్రేమఁ గావు
మనఘ నేఁ బోయి జనకుని యానతిచ్చు
బాస చేసెదఁ దోడ్పడు భద్ర మెసఁగ. 17

వ. అని పలుతెఱంగులం గొనియాడి యార్ద్రవస్త్రంబుతోఁ దండ్రిమ్రో
లకుం బోయి దండంబు లిడి యచ్చటిజనంబులు వినంగ ని ట్లనియె.

క. అయ్యా వచ్చితి నాచే
జయ్యనఁ జేయింపు బాస • జనములు గన నే
నెయ్యదియైనం జేసెద
నియ్యవనిం గీర్తి పొందు • మీ హేతువుచేన్. 19

వ. అని పల్కెడుసత్యవతిం జూచి యచ్చటిజనంబు లచ్చెరువొందుచు
ని ట్లనిరి. 10

తే. బాపురే యేమిధైర్య మీ • బాలికవద
నారవిందంబునందు భ • యాతిరేక
చిహ్నములు లేక పయిఁబయిఁ • జెన్ను మీఱి
యుంటకును నేమి హేతు వై • యుండు నొక్కొ. 21

సత్యవతి ప్రమాణంబు సేయుట.

వ. అని మాటాడుకొను చుండుసమయంబునం జంద్రగుప్తనరేంద్రుండు వ్యాళగ్రాహివలనఁ గ్రూరోరగంబును మద్యకారకునిచే మద్యంబును గులాలునివలన నార్ద్రఘటంబును దెప్పించి కూఁతుం జూచి యి ట్లనియె. 22

క. చేసెద బాసను నాపై
దోసము గనుపట్టెనేనిఁ • ద్రుంపుము తల నం
చీసునఁ బల్కితివి గదా
రా సరవిం జేయు మిపుడు • రహి నిజ మెఱుఁగన్. 23

వ. అని యావ్యాళగ్రాహిం బిలిచి చిఱచిఱలాడుచు బుసగొట్టుచు విసంబు గ్రక్కుచుండు నుగ్రభుజంగంబును సత్యవతిముందట విడిచి పొమ్మనుడు వాఁ డట్లు చేయ నది యంత. 24

ఆ. పడగ నేలఁ గొట్టి • పఱచి జనంబులఁ
పైకి నుఱుక దానిఁ • బట్టి చుట్టఁ
జేసి తలను దాల్చి • చెచ్చెర నని కూఁతుఁ
జూచి యనఁగ నపుడు • చూలుపడఁతి. 25

తే. అమ్మహాగ్రాహి నంత రయమునఁ బట్టి
పుష్పహారంబుఁ గంధరంబున ధరించు
నట్లు కంఠమున ధరించి యందఱకును
దండములు పెట్టి యిట్లనె తండ్రులార. 26

తే. ఇఁకఁ బ్రమాణంబు చేసెద నించుకేని
తప్పిదం బున్నఁ దగినయుత్తరు వ్రసంగుఁ
డంచు నాపామును శిరంబునందుఁ జుట్ట
చేసి యిడికొనె యంద ఱచ్చెరువు పడఁగ. 28

వ. అప్పు డెల్లవారి ట్లనుకొనిరి. 29

తే. ఏమి యీవింత భయమించుకేని లేక
యుగ్రభోగిని శిరమున నుంచుకొనియె
నుంచినప్పటి కది యెందు నులుక కుండ
నూరకున్నది మఱి మంత్రముండు నొక్కొ. 30

వ. అట్లేదేని మంత్రరాజం బిక్కన్య యెఱింగి యుండుటం జేసి తన్మహి
మాతిశయంబున నూరకున్న దట్టిమంత్రంబు లనేకంబులు నేర్చియుం
డు లేకున్న నిప్పరుషప్రమాణంబు సేయ నొడిగట్ట దనుచుండ నా
చంద్రగుప్తుండు పుత్త్రిం జూచి. 31

క. శిరమున నురగము నిడికొన
నరు దని నేఁ దలఁప దానియం దీఘటముం
బూరి నిల్పి మద్యమును గొని
పరిపూర్ణముగాను బోసి పాటవ మెసఁగన్. 32

తే. కుండలో నుండుక ల్లొల్క కుండ నిపుడు
వృద్ధవిప్రుండు సెప్పిన విధిని బొమ్మ
త్రోవ యచ్చటి కిదె చూడు తోడ వచ్చు
వాఁడ నని చెప్ప నాసత్యవతి రయమున. 33

వ. వృద్ధవిప్రుఁడు సెప్పినమాడ్కి శిరంబున సమ్మద్యపూరితార్ద్రిఘటం
బును వలయితభుజంబుపై నిడికొని చూపఱ కిట్లనియె. 34

క. అందఱకుఁ బ్రేమ మ్రొక్కఁద
నందఱు దీవింపుఁ డింక నరిగెద మీ రా
నందంబునఁ బొడగనుఁ డర
విందాప్తుఁడు చరమదిశకు వెడలక మున్నే. 35

వ. మఱియు నాపోవుస్థానం బిటకు షడ్యోజనపరిమితదూరం బున్న
దని వింటి నని దక్షిణాభిముఖి యై పథంబుం జూచి సూర్యచంద్ర
శేఖరులను శివయోగీంద్రుని మనంబునం దలంచుచు నరుగుచుండె
నయ్యవసరంబున. 36

తరలవృత్తము. పరిజనంబులు వెంట రాఁగ నృపాలుఁడశ్వము నెక్కి చె
చ్చెరఁ గొమారిత పోవురీతి విశేషకోపవికారుఁ డై
పురజనావళి సూడఁ దాఁ గనఁ బోవుచుండెఁ గరంబునం
దరవరిఁ ధరియించి యప్పుడు తల్లి కూఁతున కాత్మలోన్. 37

ఉ. తప్పును దాఁచితే ననుచితం బని యెంచితి నెంచకున్న నీ
యొప్పమి గల్గునే యకట యోచన దోఁపక పోయె నింక నే
నెప్పుడు చూతుఁ గూఁతు నని యేడ్చుచు నింతె ఋణంబు కద్దునం
జొప్పడఁ బుట్టినందులకుఁ జూడఁగ నంచును జింత నొందుచున్. 38

క. తొలి నేఁ జేసినపూజా
ఫల మింతియ పో యటంచుఁ బలితోఁ బోవం
దలకొని యుం బో నోపక
ఱులు సేరెను వెనుక మఱలి యీశ్వర యనుచున్. 39

ఆ. అపుడు పురజనంబు లందుఁ గొందఱు గూడి
యేఁగి చూత మెల్లరీవిచిత్ర
మెట్టు లగు నటంచు నేఁగి రాచూలాలు
నంత సరవి వేంకటాద్రిపథము. 40

క. చనుచుం దనబడి వచ్చెడు
జనములఁ దాఁ జూడకుండఁ జన్మత్రోవ యిదే
యను చోరులఁ జూచి యడుగక
వనజాప్తునిమీఁదిభక్తి వదలక వడిగన్. 41

చ. శిరమున భాండ మున్నదని చిత్తమునందుఁ దలంపకుండ నం
బరమునఁ బోవుపక్షిపతి భాతి పథంబునఁ బోవుచుండె సా
దరమున నప్డు నందిని ముదంబున నెక్కి నభంబునందు శాం
కరియును రా మహేశ్వరుఁడుగావఁగ నేఁగుచు నుండెఁ గన్యతోన్.

వ. అట్లరుగుటం జేసి గణాధ్యక్షుండును వీరభద్రుండును షాణ్మాతురుం
డును భృంగీశచండికేశ్వరాదిభూతగణంబులును జూచి యిదేమి
వింత యని శంకరుని వెన్నడిం జనుచుండ నప్పు డాశాధిపతులు
వీక్షించి యిట్లనుకొనిరి. 43

ఆ. ఎచటి కేఁగువాఁడొ యిమ్మాయి నీశ్వరుం
డెచట నేమిదోసఁగు లేరికైనఁ
గల్గెనో మఱెట్టి కట్టిఁడి యేభక్తు
బాధవెట్టెనో విరోధముగను. 44

వ. మఱియు గర్భవతి యగునిక్కన్యకారత్నంబును రక్షింపఁ బోవువాఁ
డోంనమోమృత్యుంజయాయ యని నమస్కరించిరి పులోమజాప్ర
ముఖామరాంగనలు నమోశూలపాణయే యని ప్రస్తుతించిరి మహా
యోగీంద్రులు గాంచి నమోత్రిపురాంతకాయ యని కీర్తించిరంత
నాచూలాలు సిద్ధవటపురంబును దాఁటి ఖరపాఖ్యపురమార్గంబునం
జనుచుండ నందలిజనంబు లారాజకన్యకను జూచి విస్మయపరీతచే
తస్కులై యిట్లనుకొనిరి. 45

ఉ. ఇంటికిఁ గానికన్నె యిల నిమ్మెయిఁ జూలును దాల్చి యుండఁగాఁ
గంటిమె యెవ్వరేని మును గంటి మటంచును జెప్ప వీనులన్
వింటిమె యేమి కాల మిది వేల్పులవేడబమో తలంపఁగాఁ
దుంటలతోడఁ గూడి యిటు దూఁకలి పొందఁగఁ జూలు తాల్చెనో.

సీ. మఱియు నిక్కన్యకా § మణి చంద్రగుప్తభూ
పాలుని పుత్త్రి కాఁ § బోలుఁ జూడ
గర్భంబు దాల్చిన § కతన దానినిజంబు
గనుపట్ట బాస ని § క్కరణిఁ బూని
తనరాజధర్మము § దప్ప నటంచు భూ
జనములు చూడంగఁ § గనికరంబు
వదలి సేయించిన § వాఁడు లేకున్నచోఁ
దరవరి కరమునం § దాల్చి హయము
నెక్కి వెన్నడిఁ బో నేల § యింతతీవ్ర
ముగ నటంచును బలువిధ § మ్ములుగ మాట
లాడుకొను చుండి రప్పురి § యందు గుంపు
గూడి యప్పుడు చూలాలు § గొంకు విడిచి. 47
తే. జనపదంబులు సకలస § స్యములవృద్ధి
చే నెసంగెడుభూములు § చెన్నుమీఱు
వనములను దాఁటి వేగమ § వచ్చె వీర
భద్రపురవీథి నచ్చటి § పౌరు లెల్ల. 48
సీ. కంటిరే యీరాచ § కన్నియఁ జూలుతోఁ
బచ్చికుండను దల § పైని బూని
కడురయమ్మునఁ బోవు § కత మేమి గల దొక్క
తోడ్పాటు లేకుండఁ § ద్రోవఁ గడఁగి
మఱి చూలు దాల్చిన § మగువ లివ్విధమున
నడతురె మార్గముఁ § దొడరి భళిరె
యేమి యీవింత మ § ఱేదేని దప్పున్నఁ
జేసిరో దండన § యీను చేతఁ
జెఱఁగు మాయక చూ లెట్లు § చెందె మఱియుఁ
గుంతి తొల్లి ధరింపదె § వింత మీఱ
నవ్విధం బగుఁ గాఁబోలు § నైనఁ దల్లి
యొడఁద దయ లేక బాసకు § నెట్లు పంపె. 49

వ. మఱియు నీచూలాలితల్లిదండ్రులకుఁ బురోహితామాత్యాదిజనంబు
లైన 'నికార్యంబు దేవఋషులమహిమాతిశయంబువలనం గల్గి
యుండు నిద్దానికి "సహసావిదధీతనక్రియా" మనునార్యవచనంబుఁ
బాటించి ప్రమాణంబు సేయింపుఁ' డని చెప్పక "యథారాజాతథా
ప్రజా" యనులోకోక్తివలె రాజు పోయినతెఱంగునం బోవుటం జేసి
యిట్లయ్యె నని మాటలాడుకొను చుండి రప్పుడు. 50

క. ధరణీనాథునివెన్నడిఁ, బరిజనములు నడవ లేకఁ బడలి పథమునం
దురుతరువులనీడల ని,ల్చిరి తురగము నట్లు చేవఁ జెడి పుడమిపయిన్.

క. తడఁబడుచు నిల్చి నడవక
కడుదప్పి వెసంగి జేఁడుఁ గాసారములం
దడవుచు జలములు ద్రావుచు
బడలి తురంగంబుతోడఁ బథమున నొకచోన్. 52

తే. భూరుహచ్ఛాయ నాయూసఁ ముడుగఁ జేరె
నంత నాసత్యవతి పథంబెంతదూర
మున్నదో యింక నని మదిఁ నెన్నకుండ
జనకునానతిచొప్పునం జనుచు నుండె. 53

వ. అట్లరుగుచు మార్గమధ్యంబున ఘోరమదేభశార్దూలవరాహభల్లూ
కోగ్రభుజంగాది జంతుసంతానాన్విత భూరిపర్వతమహీరుహకంటకల
తానికుంజపుంజపరిపూర్ణదుర్గమకాంతారంబును గడచి వృక్షరహిత
విశాలభూప్రదేశంబునం గలసెలయేళ్లు దాఁటి వచ్చుచు ముందట.

క. జలధులు మించుతటాకం
బులు గమలాకరము లొప్పఁ భూదేవి శుభో
జ్జ్వలవసనము దాల్చినదనఁ
బలువిధసస్యాభివృద్ధిఁఁ బరఁగెడు భూమిన్.

తే. ఎలమిఁ బొడగాంచి యించుకఁ నిలిచి తండ్రి
యానతిచ్చినచో టెయ్యఁదని తలంచు

చుండ సస్యాన్వితానిలం బొడలఁ జల్లఁ
దనము గావిచె బడలిక తొలఁగ నపుడు. 56

అశరీరవాణి సత్యవతికి సురాభాండంబును డింపు మని చెప్పుట.

ఉ. రాజకుమారి చూడు మట రాజగృహంబులు రమ్యగోపుర
భ్రాజితనవ్యరత్నశిఖరంబులతో నెసలారు చుండుఁ గాం
భోజపురం బదే యటకుఁ బోయినఁ గాంతువు భూరిగాలవ
క్ష్మోజము దానిమూలమునఁ గ్రచ్చఱ డింపుము మద్యభాండమున్.

వ. అని నభంబుననుండి వినంబడుటం జేసి యాచూలాలు ముదం బంది
యించుక నిలిచి కనుదోయి నలుదెసలం గలయం జూడఁ బురోభా
గంబున శారికాశుకపికమయూరప్రముఖానేకవిహంగసందోహకృత
మధురరుతివిసరసంకలితోద్యానవనంబులును దన్మధ్యంబునం గలు
షనిచయఘ్ని యగుభాస్కరతరంగిణియుం జెలువాఱుచుండఁ ద
త్కాలంబున. 58

తే. సకలసౌభాగ్యకలితంబు సర్వశత్రు
సమదవారణవారపంచాననంబు
ఘనయశోధామ మఖిలసౌఖ్యప్రదంబు
పొరిఁ గనుంగొనెఁ గాంభోజపురవరంబు. 59

తే. అట్లు పొడగాంచి ముద మందు చాపురమున
కుత్తరపు దిక్కునదిదరి నుండుదీర్ఘ
శాఖ మగుసాంద్రదళోర్ధ్వవృక్షంబుకడకు
నరుగ నత్తటి మఱల నంబరమునుండి. 60

క. విన వచ్చె బాలికా యిటఁ
జనకు ఘటం బిచట డింపు జనకుఁడు నీకా
జ్ఞ నొసంగినచోటిదిగో
గను గాలవపాదపంబుఁ గను లారంగన్. 61

సత్యవతి సురాభాండంబును డించి ప్రత్యక్షుం డైనపరమేశ్వరుని స్తుతించుట.

చ. అన విని యాపొలంతి ప్రమథాధిపు నెంచుచు నర్కు వేఁడుచుం
తనతల నుండుభాండమును దద్రుమమూలమునందు డించెఁ జ
య్యన నపు డంబరస్థలి సురాంగన లందఱు గుంపు గూడి తె
చ్చెను వనజాక్షు లందఱును శ్రీయుతకీర్తి ధరాతలంబునన్. 62

వ. అని విస్మయపరీతచిత్తు లై పుష్పవర్షంబు గురియించి రయ్యవసరం
బున నత్యంతానుమోదాత్ము లై శాంఖికులు శంఖనాదంబులు
సేయఁ బ్రమథగణంబులు గొల్వ వృషరాడ్తురంగంబున నుమాసహి
తుం డై యయ్యంతర్వర్తి సమ్ముఖంబున నిలిచినం జూచి యాసత్య
వతి పరమానందదుగ్ధాంబుధినోలలాడుచు నిట్లు వినుతించె. 63

చ. జయ రజతాచలేశ గిరిజాకలితార్ధశరీర యోగిసం
చయకృతవాస దైత్యరిపుసంఘవిలాస మహేశ్వరా దుర
త్యయనిగమప్రకాశ కుసుమాస్త్రవినాశ యఘాపహా పుర
త్రయహర వ్యోమకేశ మదదానవనాశ భుజంగభూషణా. 64

తే. సకలలోకేశ సర్వేశ సవననాశ
సకలభూతహితప్రద సదయహృదయ
భక్తలోకైకరక్షణ పావకాక్ష
దీనమందార శంకరా దేవదేవ. 65

సీ. ఎవఁడు మూఁడుగుణంబు లెసఁగ ముమ్మూర్తులు
గాఁ బ్రకాశించెడు ఘనవిభుఁడు
ఎవఁడు మాయైకగృహీతచిత్తులకు ర
జ్జూరగభ్రాంతిని నొప్పువాఁడు
ఎవఁడు భూతలజల పవనాగ్నినభములం
దలరి ప్రపంచాత్ముఁ డైనవాఁడు
ఎవఁడు జీవులయందు నెసఁగి యంతయుఁ దాను
నిండి యక్షీణుఁ డై యుండువాఁడు

ఎవ్వఁ డీ యేడుజగముల । కీశ్వరుఁ డయి
విమలతేజంబు వెలిఁగించు । వేడ్క నట్టి
నీదుమితిలేని మహిమంబు । నెఱి నుతింప
శక్యమే నాకు శంకరా । శరణు శరణు. 66

చ. పరు సగుబాస నీవరక్ష । పర్ణ నెఱవేర్చినదాన సోమహే
శ్వర యిఁక నుండ నోపఁ బెఱ । వారలు చూడఁగ నిజ్జగంబునం
దరయ భవత్పదాబ్జముల । యందు రయంబునఁ జేర్చుకొమ్ము స
త్కరుణ నటంచు వేఁడునెడఁ । గన్గొను గుట్టొగిఁ జూలుమించుటన్.

తే. అపుడు నందిని డిగ్గి యు । మాధిపుండు
సత్యవతిఁ బ్రీతిఁ జూచి నీ । సరణి ననియె
నమ్మరో చింత యేల నీ । వడిగినట్లు
మత్పదంబులకడఁ జేరు । మఱియు నిపుడు. 68

తే. వినుము నీగర్భమునఁ బుట్టుఁ । దనయుఁ డెలమి
వానిఁ గని మోద మొందుము । దానిమీఁద
జనకుఁ డిట వచ్చి నీబాస । సత్య మంచు
మెచ్చినం గాని యెటకేని । మీఱి చనుట. 69

తే. తగవు గా దట్లు పాయిన । ధర్మము సెడు
మిత్రుఁ డస్తాద్రి కేఁగక । మింట వెలయు
చుండువిధమును నీతండ్రి । చూడ వలయుఁ
ద్వర యిదేటికిఁ గొండొక । తడవు నిలువు. 70

వ. అదియునుం గాక యిపుడు నీగర్భంబునఁ బుత్త్రుఁ డావిర్భవించు నా
శిశువుం జూచి సంతసించి యావల నిట కింద్రభాగంబునఁ గ్రోశద్వ
యపరిమితదూరంబునందు భాస్కరనది ప్రవహించుచుండుఁగాన నట
కుం బోయిన. 71

తే. కందు వానదిమధ్యభా । గంబునందుఁ
గడువెడల్పగుఱాయి యొ । క్కండు దాని

నట్టనడుమను జేరి మహనమున నన్నుఁ
దలఁచుచుం జేత నాశిలఁ ద్రట్టెనేని. 72

వ. అప్పు డాపాషాణంబు పటపట పగిలి యొక్కత్రోవగ నేర్పడు నా
మర్మమార్గంబున నుండి నాకడం జేరి సుఖం బుండు మచ్చోట
నయ్యాదిమొదలుగాఁ బాతాళర్ఘురం బనం బరఁగి యందు నిరంతర
మఘాపహారి యగుగంగ ప్రవహించుచు జనంబులకు రెండవవార
ణాశితెఱంగునఁ బ్రసిద్ధి గాంచు నదియునుం గాక. 73

మత్తకోకిలము. బాలికా నిరతంబు న న్మది భక్తిమైఁ గుసుమాక్షతల్
ఫాలలోచన చంద్రశేఖర భవ్యరూప దయానిధీ
నీలకంఠ యటంచు నర్చన నెమ్మిఁ జేసితి విమ్మెయిన్
కాలుఁ దోలఁగఁ దొల్లి సేసె మృకండుమానిసుతుం డొగిన్. 74

వ. కావున నీసదమలభక్తిలత మదీయచిత్తంబునం బెనంగిన దగుటం
జేసి నిన్ను రక్షింప సమకట్టి సిద్ధవటపురిం బాసి యిట కేతెంచితి
నిఁక నీ మద్యఘటంబునం దుద్భవించి మహాక్షేత్రంబు లగు కాశీ
కాళహస్తి కాంచీ గోకర్ణ శ్రీశై లారుణాచల వృషభాచల
వృద్ధాచల చిదంబరాదు లెట్టిక్షేత్రంబునం బ్రసిద్ధిగ మద్భక్త
జనబృందంబులకు నీప్సితార్థంబు లానందంబుగ నొసంగుచుండెద
నీకతన నియ్యెడకు సత్యవతీక్షేత్ర మనియు సురఘటక్షేత్ర మని
యుం జెప్ప నొప్పు నిఁక నంతర్హితుం డయ్యెద నని యామద్య
భాండంబున లింగాకారంబునఁ బ్రకాశించె నంత సత్యవతి యయ్యా
కారంబు గ్రుడగాంచి యనేకవిధంబులం బ్రస్తుతించుచు నుండు
సమయంబున. 75

తే. కడువడిగఁ ద్రోవ నడచుటకతన బడలి
నిండుచూలాలు నచ్చటకనిల్వ లేక
సొమ్మసిలె నేల నప్పుడుకచూలుకుట్టు
గదుర దేహం బెటింగి తాఁక గనులు దెఱచి. 76

తే. చూడ డగ్గఱ గట్టురా ౹ జూలి తనకు
బాసటగ వచ్చుటం జేసి ౹ పరమసుఖముఁ
గాంచె బాలార్కతేజసం ౹ కాశుఁ గ్రూర
జనవిరోధిని బుత్త్రిని ౹ సచ్చరిత్రు. 77

వ. అప్పు డాశిశువు కావు కా వని యేడ్చు చుండుటయుం దెలియక సత్యవతి కొండొకతడవు దేహంబు మఱచి యుండె నాసమయంబున నుమాదేవి యాంతర్హితురాలయ్యె ననంతరంబున. 78

చంద్రగుప్తుండు సత్యవతికడఁ జేరుట.

ఆ. ఒకలు దెలసి సరస ౹ నుండినశంకరిఁ
గానకుండుటకును ౹ మానసమునఁ
జింత నొందు చుండె ౹ నంతినచ్చుటఁ దండ్రి
త్రోవ గానఁబడక ౹ తూలవ్రాయి. 79

క. కడు డస్సి పథముఁ దడవుచు
బడలినవారువముమీఁదఁ ౹ బథమునఁ దనవె
న్నడి రా నోపక యమ్మె
యెడ నిల్చినవారియందు ౹ నెనఁ గొందఱితోన్. 80

వ. కొండొకతడవునకుఁ గూఁతురు వచ్చినయెడకుం జని ప్రతీచీదిశం జూడ నప్పు డర్కుండు చరమాద్రి కేఁగకుండుటం జేసి పుత్త్రి చేసి నప్రమాణంబు సత్యం బని తలంచి యశ్వంబు డిగి పుత్త్రికడకుం బోయి. 81

సత్యవతిని చంద్రగుప్తుండు నిజపురంబునకుఁ బోవుదమని పిల్చుట

తరళవృత్తము నిలిచి యచ్చటఁ గావు కా వని ౹ నేలపైఁ బడి యేడ్చుచుం
బొలుచు బాలునితోడ నుండెదు ౹ పుత్త్రినిం బొడగాంచి నా
తెలివి లేమికి నేమి సేయుదుఁ ౹ దేర కిమ్మెయిఁ బెక్కుగీ
తులుగ దూఱితి బాధ వెట్టితి ౹ దుష్టురాలని యక్కటా. 82

సుగంధివృత్తము. బాసఁ జేసెఁ జెప్పినట్లు ౹ భంగ మొందు లేక ఛా
యాసమేతుఁ డైనయర్కుఁ డ ౹ స్తమింప లేదు ను

ల్లానమూరఁ జేరె నిష్కళంకచిత్త యై దుర
భ్యాసదోష ముండెనేని శాసఁ జేయఁ గల్గునే. 83

వ. అని మనంబునం దలపోసి కూఁతుం జూచి ప్రియవచనమ్ముల నిట్ల
నియె. 84

క. అమ్మా కోపము సేయకు
నెమ్మది నాతోడఁ బల్కు నేరము లున్నం
బొమ్మని తిరస్కరింపకు
నిమ్మాడ్కిం జేసితి నని యెద నెంచకుమా. 85

తే. మున్ను నీతల్లి యీగట్టు మూయకుండ
వెల్లడించుటఁ జేసి యే విధినినైన
జనులు దూషింతు రిల నంచు సత్య మరయ
శాసఁ జేయించి తిట్టు లాయాసపడకు. 86

క. నానుడివినట్లు శాసను
బూని యొనర్చితివి మేలుఁ బొందితివి ధరా
జానికులంబునకు యశః
శ్రీ నెగడం జేసితివి ధరిత్రీఁ గుమారీ.

వ. కావున నీవు పరిశుద్ధురా లని యిపు డెఱింగితి నీకుఁ బల్యాంకిక నొ
కండు దెప్పింతు నందు నీశిశువు నుంచికొని నిజపురంబునకు నాబ
డిం జను దె మ్మనెడుజనకునిపదారవిందంబులకు నమస్కరించి సత్య
వతి యిట్లనియె. 88

మ. జనకా నాపయి నాస వెట్టకుము దుశ్చారిత్ర నై యుండుదా
నిని గొంపోయి కులంబులో నిడఁగ దుర్నీతిప్రచారుం డటం
చును లోకుల్ గనిదూఱకుండురె మఱిచ్చోఁ బాసి నీవెంట రా
ననిపల్కంగ నరేంద్రుఁడందులకుఁ జింతాక్రాంతుఁడై కూఁతుతోన్.

తే. అనియె నిమ్మాడ్కి నమ్మోహ యాత్మలోన
నెట్టిచింతలు వెట్టకు నెట్టితప్పు

లున్నఁ ద్రవ్యకు నాపయి నొంటి యిచట
నుండ నేటికిఁ దగు మేడ నుండ బాల. 90

క. ఇది నిర్జనప్రదేశము, గద యిందే మున్నదమ్మ కల్లుకడవ యు
న్నది వేఱె లేదు కావున, మదిఁ గోపము లేక రమ్ము మా సత్యవతీ.

చ. అని పలుమాఱు రమ్మనుచు నర్మిలిఁ బిల్చెడు తండ్రిఁ జూచి యి
ట్లనియె సురాఘటం బనుచు నాత్మఁ దలంపకుఁ జూడు దానిలోఁ
గనఁబడుచుండు నవ్యయసుఖప్రదలింగము భక్తలోకపా
వనమహిమానుషంగ మొగి వాంఛితదాయక సిద్ధలింగమున్. 92

చంద్రగుప్తుండు కల్లుకుండయం దుద్భవించిన లింగముం జూచి నుతించుట.

క. అని చెప్పఁ జంద్రగుప్తుఁడు
విని యాభాండంబుకడకు విస్మయచిత్తం
బున నేఁగి చూడ నందుం
గనుపట్టెను లింగమొండు కన్నుల కెలమిన్. 93

తే. అప్పు డాదివ్యతేజోమయాకృతి గల
లింగమును జూచి భయభక్తిసంగతాత్ముఁ
డగుచు దండప్రణామంబు లాచరించి
ప్రస్తుతించెను దా మద్యభాండభవుని. 94

ఉ. శ్రీరజతాచలేశ శశిశేఖర శంకర నీలకంఠ కా
లారి త్రిశూలపాణి త్రిపురాంతక భూతగణాధినాయకా
ఘోరభవాబ్ధితారక యకుంఠితవిక్రమ ఫాలనేత్ర గౌ
రీరమణా కృపాశయధురీణ మహేశ్వర భక్తవత్సలా. 95

ఆ. చేయరానితప్పు చేసి చూలయ్యో నీ
దుష్టురా లటంచు మహితవలనఁ
దప్పెఱుంగుటకును దలఁచి యిమ్మెయిఁ బ్రమా
ణంబు సేయు మంటి నాగభూష. 96

తే. దానిసత్యం బెఱింగితి దానికతన
నిట్లు లింగాకృతిం దాల్చి యీఘటమున
ఘనత నెలకొన్న నినుఁ గంటిఁ గన్నులార
దక్షమఖభంగ శ్రితజనపక్షలింగ. 97

ఆ. పుత్త్రిచిత్తవృత్తిఁ బూని యెఱుంగక
చేసినాఁడ దానఁ జేసి యలిగి
నన్ను నీవు గావకున్నచో నెవ్వారు
గరుణఁ జూతు రయ్య కాలకంఠ. 98

క. గురుఁడు శివయోగిచంద్రుఁడు
పరమదయాకరుఁడు మును భవన్మంత్రము నా
కురుకృప నుపదేశించెను
నిరతముఁ బఠియింతుఁ దలఁతు నీసుగుణతతిన్. 99

వ. అని బహుప్రకారంబులం గొనియాడుచుండ నశరీరవాణి యిట్లని
యె. 100

సీ. కుతలేశ విను సత్యవతి సారమంత్రంబు
శివయోగివర్యునిచే గ్రహింపఁ
బడి తత్ప్రభావంబు వలన గర్భముఁ దాల్చె
నింతియ యపరాధ మేమి లేదు
మఱి బాల్యముననుండి మత్పూజ భక్తిగఁ
జేయుచు నుండుటం జేసి తోడ
వచ్చితి నా సిద్ధవటపురిం బాసి యి
చ్చట నుందు నీమద్య ఘటమునందు
దానిపేరు వెలయ ధర భవదాజ్ఞను
బూని బాసఁ జేసి భూరికీర్తి
పొందె దానికతనఁ బుణ్యాత్ముఁ డైతివి
బాధపెట్టి తంచుఁ బడకు చింత. 101

వ. మఱియు సకలపుణ్యక్షేత్రమహిమాతిశయంబు లిందుం బ్రభూతం

బగుటం జేసి సర్వఘోరరక్షోభూతపిశాచాదిదుష్టగ్రహభంజనుండ నై
జన్మాంతరానుప్రజాపహారుండ నై సమస్తకామ్యార్థప్రదాయకుండ
నై యుండుదు నిమ్మోడ నాకు రమ్యమందిరంబు నిర్మింపుము శిశున
హితంబుగఁ బుత్త్రిం దోడ్కొని పోయి తద్బాలకునిఁ బ్రవర్ధితుం
జేసి సంతసంబున యువరాజుం జేసి సుఖం బుండు మిదియునుం గాక.

ఆ. సచ్చరిత్ర యైన § సత్యవతికి గర్భ
మందు నుదయ మయ్యె § నట్లు గాన
సకలజనులుఁ బ్రీతి § సాత్యవతేయుఁ డం
చనఁగ నామ మిడుము § జనవరేణ్యా. 103

వ. మఱియు నా బాలుండు. 104

శా. భూపాలవ్రజపూజితోజ్జ్వలపదాం § భోజాతయుగ్మండు వి
ద్యాపారంగతుఁ డుగ్రశత్రుసమర § వ్యాపారశూరుండు ధ
ర్మోపేతుండు ప్రశస్తలక్షణసమ § గ్రోదంచితాంగుండు ని
ష్కోపాత్ముండు యశోవిశాలుఁడు దయా § కూపారుఁ డుర్వీశ్వరా.

తే. మఱి యుదారుండు సుగుణస § మగ్రుఁ డార్త
జనశరణ్యుఁడు బంధుభూ § షణుఁడు నిత్య
సత్యసంధుండు సౌభాగ్య § సంయుతుండు
సుకృతకర్మకలాపుఁడు § సుజనహితుఁడు. 106

క. తనతల్లిఁ బ్రోలెఁ బరకాం
తను జూచెడువాఁడు గురుబు § ధజనులఁ బూజల్
మనసారఁ జేయువాఁ డిల
జనములఁ బ్రేమించువాఁడు § సద్వృత్తి నొగిన్. 107

క. అని చెప్పఁగ నానరపతి
విని యిట్లనియె న్మహేశ § వేడ్క నను జే
కొనుమయ్య సమయ మిది యేఁ
గొననోపఁ బ్రపంచసుఖముఁ § గొనకొని యింకన్. 108

వ. అనిన విని పరమేశ్వరుండు చంద్రగుప్తున కిట్లనియె. 109

తే. మానవేశ్వర మత్సన్నిధానమునకు
వచ్చుకాలంబు గల దంతవఱకు రాజ్య
పాలనము సేయు దౌహిత్రుఁ బ్రమద మారఁ
బెద్దసేయుము పత్నితోఁ బ్రీతి నుండు. 110

వ. అంతఁ గొంతకాలంబునకు దౌహిత్రుని యువరాజుం జేసి వాఁ
డొనరించురాజ్యతంత్రసామర్థ్యంబును గాంచి సంతసించుచు శివ
యోగీంద్రోపదిష్టమంత్రరాజంబును బఠించుచు నుండుము పర్య
వసానంబున మత్సన్నిధి కేతెంతు వనిన విని చంద్రగుప్తుండు పర
మానందాంబుధి మునింగి యాసిద్ధలింగంబునకుఁ బునఃపునఃప్రణా
మంబు లాచరించి పుత్త్రిం జూచి ప్రియంబున నిట్లనియె. 111

క. అమ్మా రా పోదము లే
వమ్మా బాలకునితోడ నన విని తండ్రిం
బొమ్మనుడు సత్యవతితోఁ
గ్రమ్మఱ నిట్లనియెఁ బ్రీతి రాజేంద్రుఁ డొగిన్. 112

క. కోపంబు మాను నాపరి
తాపంబును దొలఁగఁ జేయు తనయా నీపైఁ
బాపం బొకండు లేదు కృ
పాపూర్ణమనమున రమ్ము పావనచరితా. 113

వ. అని యనేకవిధంబులం బిలువ నాసత్యవతి రా నోప ననుటం జేసి
దౌహిత్రుని నొకపల్యంకిక నిడికొని నిజపురంబునకుం బోయి
భార్యారత్నం బగుపుణ్యవతికిఁ బుత్త్రిగర్భంబున జనించినవాఁ డని
యాదౌహిత్రు నొసంగి పుత్త్రివృత్తాంతం బంతయుం జెప్ప నప్పుణ్య
వతి విని యత్యంతశోకపరవశ యై భర్తతో నిట్లనియె. 114

తే. కూఁతు నెబ్బంగి నేఁ గనుఁ గొందు నాథ
దానికడఁ జేర్చు నన్ను నేత్రంబు లారఁ

జూచి ప్రాణంబు విడిచి నేసుగతిఁ గందుఁ
గాలయాపనమును జేయఁ గాదు లెమ్ము. 115

తే. దానినిజ మిట్టి దని యించుకేని యెఱుఁగఁ
జాల నైతిని మోఱకు నై సరకుఁ గొనక
యేమి సేయుదు నాకర్మ మిట్టు లుండ
నక్కటా యని వగచుపుణ్యవతిఁ జూచి. 116

వ. చంద్రగుప్తుం డిట్లనియె. 117

చ. గతజలసేతుబంధనము కైవడిఁ బోయినదాని కేల నీ
వతిపరితాప మొందెదు సహాయము దానికి శంభుఁ డుండె స
ద్గతిఁ గలిగింప భానుఁ డనుకంపముమైఁ గనుచుండె నింక దు
ర్గతి కొకహేతు వుండునె యకల్మషురాలుగ నుండ నిమ్మహిన్.

తే. ఇప్పు డట కేను గాంతరోగ మేఁగి కల్లు
కడవఁ బుట్టినసిద్ధలింగమున కాల
యంబు గట్టించి నిత్యోత్సవాదు లెల్లఁ
బూని చేయింపవలెఁ గ్రమంబుగను గాన. 119

వ. ఏతచ్ఛిశురక్షణార్థ మొకపాలంతిని నియమించెద రమ్ము నాబడి నని యట్లు చేసి వలసినవిత్తంబుం గొనిపుణ్యవతితో రథారూఢుం డై పరిజనంబు లుభయపార్శ్వంబుల నడవ నమ్మహాఘటంబుకడకుం జను చుండి రయ్యవసరంబున నాసత్యవతి యమ్మద్యఘటనికటం బున నుండి యన్యజనముఖావలోకనంబు సేయ నోప నని తలంచి తనవేఁడికోలున కాసిద్ధేశ్వరుం డానతిచ్చినయట్లు పూర్వభాగంబున నేఁగి యం దున్నభాస్కరనదినదుమం గలవిశాలపాషాణంబును జూచి తన్మధ్యభాగంబునకుం జని యమ్మహేశునిఁ బలువిధంబులం బ్రార్థించుచు నాశిలను గరకమలంబునం దట్టినప్పుడు. 120

సత్యవతి పాతాళరథమార్గంబునఁ గైలాసంబునకుం బోవుట.

సీ. పెళపెళ యని పేయిపిడుగు లొక్కుమ్మడిఁ
బడినట్లు పెలుచ శబ్దంబు గల్గి

పటపట నాశిల పగిలె నం దొకగుహా
  గన్పట్టె నందుండి కడువిచిత్ర
ముగ శూలిభృత్యులు మున్నడి వివిధవా
  ద్యరవంబు లెలమిఁ జే యంగ వెంట
మహితపంచాక్షరీ మంత్రరాజంబుఁ బ
  ఠించుచు యోగీంద్రు లేఁగుదేరఁ
గనకమయ మగుపల్యంకి కను సుభూత
గణము వెన్నడిఁ గొనిరాఁగఁ గలుషహారుఁడు
మహితకరుణాన్వితుఁడు మహా మహు డొకండు
తోడ నేతెంచి రాజేంద్రు దుహితఁ జూచి. 121

చ. సరసకు వచ్చి యిట్లనియె సత్యవతీ యిఁక రమ్ము దివ్యసుం
దర మగునందలంబున కుదంచదుదీర్ణగుణాఢ్య యమ్మహే
శ్వరునిలయంబుఁ జేరుటకు శంకరునానతిరీతి నంచు స
త్వరముగ నందలంబుపయి వారక చేర్చె ముదంబు నొందఁగన్.

తే. అట్లు గూర్చుండఁ జేసి మహాత్మ యభవ
హరమహాదేవ మృత్యుంజయా యటంచు
నందఱుం బ్రస్తుతించుచు నప్పథమున
నరిగి రప్పుడు తత్పథం బవనియందు. 123

వ. అన్యులకుం దెలియఁ గూడదంచుఁ బరమశివుం డొకమహాగండశిల
ను దద్ద్వారంబున కడ్డంబుగ నిడి నిజపదద్వయంబు ద్రొక్కానక్కార
ణంబున నాశిలయందుఁ దత్పదాకారంబు లేర్పడి యందుండి భాస్క
రనదీజలంబులు ప్రవహించుచుండుఁ గావున నయ్యెడకుఁ బాతాళ
ఝరం బని ప్రసిద్ధి యందుజలంబుల మునింగినవారి కఖిలపాపపుంజం
బులును సకలభూతగ్రహదుష్టరాక్షసశాకినీడాకినీపిశాచప్రపీడలు
నశించి శుభంబుగల్గు ననంతరంబ. 124

ఆ. అట్లు సత్యవతిని నందలంబునఁ గొని
భోయి దుగ్ధరాశిఁ బోలెఁ బూర్ణ

చంద్రమండలంబుకొచందాన వెలుఁగొందు
వెండికొండయందుకొవేడ్క డించి. 125

వ. అంద అమ్మహారాజపుత్త్రికారత్నంబును నమితభక్తిం దోడ్కొని బహువిచిత్రరత్నమయమంటపప్రాసాదాంతరంబులు దాఁటి ప్రశస్తరత్నప్రభాకలితకాంచన కలశవిన్యస్తసకలకళాపరిపూర్ణ బ్రహ్మాంబు తెఱంగున వెలుంగురమ్యగోపురద్వారంబు లేడును గడచి తదంతరంబునం బ్రవేశించునపు డయ్యెడ. 126

సీ. ఏవంకఁ జూచిన కొనీశునిచరితంబు
లనురక్తిమైఁ జెప్పు కొనెడువారు
ఏతట్టు పొడగన్న కొనీశునిభక్తిని
బాయక భజనలు కొ సేయువారు
ఏదిక్కుఁ గాంచిన కొ నీశునిమానసం
బున నిల్పి మునివృత్తిఁ కొదనరువారు
ఏప్రక్కఁ గనుఁగొన్న కొనీశ్వరధ్యానంబు
సేయుచు నతనిఁ బూజించువారు
ఎందుఁజూచినఁ బ్రీతిగ కొనీశురూప
ములు లిఖించెడువారును కొ మొనసి యీశు
మంత్రపఠనంబుచే మేను కొ మఱచి యుండు
వారు మఱి నృత్యములు సేయు కొ వారలరయ. 127

వ. మఱియు నందందుఁ జంద్రకాంతోపలవేదికాసీన లగుపుణ్యాంగనలను సత్యవతి చూచుచుం బోవ నయ్యోషిద్రత్నంబులు సత్యవతిం జూచి. 128

తే. ఎవతె యిక్కన్యకామణి కొ యెట్టిపుణ్య
కార్యములు సేసెనో యటుకొగాక యున్న
నిందు రాఁగలభాగ్యంబు కొ పొందు నెక్కొ
పాకరిపునకేనియుఁ దొంటి కొ ఫలము లేక. 129

వ. అని యనేకభంగులం బొగడుచుండి రావల నమ్మహాభక్తారత్నంబును గరుడకిన్నరగంధర్వాద్యనేకయక్షసందోహరక్షితం బగునవరత్న

మయకలశవిన్యస్తోత్తరద్వారంబునం బ్రవేశించి కోటిసూర్యప్రభాకలిత రత్నరచితరమ్యమంటపాంతరంబునకుం దోడ్కొని పోయి దివ్యతేజోవిరాజమానులగు బృందారకాదిమహాయోగిసందోహసంసేవ్యమానం బగురత్నసింహాసనంబున నుమాసమేతుం డగుచంద్రమౌళీశ్వరుచరణారవిందంబులం జేర్చి రంత సత్యవతి శాశ్వతానందసుధాంబుధి నోలలాడుచు ననేకవిధంబులం గొనియాడుచు దండప్రణామంబు లాచరింప నమ్మహాదేవుం డత్యంతానుకంపాంతరంగుండై సత్యవతిని దగ్గఱకుం జేరి యి ట్లనియె. 130

క. ఓయమ్మ యుండు మిం దెడం
బాయక నీచేసినట్టిబాసకుం దైవాలో
క్యాయతకీర్తి యొసంగెను
బోయబలల కెల్లఁ గీర్తిఁబొంపిరివోయెన్. 131

వ. అని తనముందట నిడుకొని యచటిమహాజనబృందంబులకంటెం బ్రియంబునం జూచుచుండె ననిన విని శౌనకాదిమునీంద్రు లావలివృత్తాంతం బేమని యడుగ సూతుం డిట్లనియె. 132

ఆశ్వాసాంతము.

క. శ్రీకల్యాణగుణాకర, రాకాద్విజరాజశేఖరా ధవళాంగా
నాకధునీధర శంకర, శ్రీకామాక్షీసమేత శ్రీసిద్ధేశా. 133

తోదకవృత్తము. పరమదయాకర పావనగాత్రా
పరమమునీంద్రదశుభస్తుతిపాత్రా
పరమసుఖప్రద భవ్యచరిత్రా
పరమయశోనిధి పావకనేత్రా. 134

గద్యము.

ఇది శ్రీమదాలూరువంశపయోధిరాకామృగాంక రామ
కృష్ణదైవజ్ఞపుత్త్రి సుజనవిధేయ వాసుదేవనామ
ధేయప్రణీతం బైన శ్రీసిద్ధేశ్వరీయం
బనుమహాప్రబంధంబునందు
తృతీయాశ్వాసము.
సంపూర్ణము.



శ్రీ ర స్తు.

శ్రీగణేశాయనమః.

# శ్రీ సి ద్ధే శ్వ రీ య ము.

## చ తు ర్థా శ్వా స ము.



క. శ్రీ కైలాసనివేశా
కాకోదరరాడ్విభూష కల్మషశోషా
నాకేశార్చితపద సు
శ్రీకలితా క్రతువినాశ శ్రీసిద్ధేశా. 1

వ. అవ్వలివృత్తాంతంబు వినుం డని మునులకు సూతపౌరాణికుం డిట్లనియె. 2

తే. పుణ్యవతితోడఁ జంద్రగుప్తుండు రథము
నెక్కి మార్గంబు గడచి మహేశు నాత్మఁ
దలఁచుచును మద్యఘట ముండుతావుఁ జేరి
పుత్రి యుండినయెడఁ జూడఁబుత్త్రియచట. 3

వ. కాన కుండుటంజేసి పుణ్యవతియుం దానుఁ జింతాక్రాంతస్వాంతులై యిట్లనికొనిరి. 4

క. మనకుఁ గనులారఁ బుత్త్రిని
గనుఁగొనుటకుఁ బ్రాప్తి లేదుగాఁబోలు నహో

మనగర్భంబుల నిమ్మోయి
జనియింపఁగనేల పాపఁజనులై యుండన్. 5

వ. అని మఱియు నందందు నన్వేషించి పుత్త్రిజాడ యొందుం గానక. 6

మ. తనయా! యొందుల కేఁగితే తెలుపు మోఁతల్లీ మముం గూర్మిమైఁ
గొనిపొమ్మందుల కేము వచ్చెదము మాఁక్రూరాపరాధంబు లె
ల్లను జిత్తంబున నుంచుకోఁ దగునె యేఁలా కిన్కమాయమ్మరో
యని చింతించెసుదంపతుల్ విన నుమాఁప్రాణేశ్వరుం డర్మిలిన్.

వ. అమ్మద్యపూరితార్ద్రిభాండంబున నుండి యశరీరవాక్క్యాన ననియె.

మ. వినుఁడో దంపతులార సత్యవతి నేఁసిక్షింప మర్త్యాళి నం
చును గ్రోశద్వయదూర మింద్రదిశగాఁ జూపట్టుస్రోతస్విని
దనరుం జారువిశాల మైనశిల యఁద్దానిం దగం గొట్టిప్రా
యొను దద్ద్వారమునుండి నిశ్చలత ముఁక్తీశుం గనుంగొంటకున్. 9

వ. కావున నిపు డయ్యెడకుఁ బాతాళఝరం బనంబడు మీ రందేఁగి యం దతిశుద్ధోదకంబున స్నానంబుచేసి రండు సత్యవతిని వెదుకఁ బని లేదనిన విని వా రట్లు చని చూడ నచ్చట. 10

తే. మునులు దమశిష్యులకు వేదఁములను జెప్పు
చున్నవా రన నయ్యేటఁనుండి జలము
ప్రణవనాదంబునను మీఱిఁపాఱుచుండెఁ
గర్ణముల కింపు మీఱఁగఁ గాంచి దాని. 11

వ. అంతరంబునకుం బోయి చూడ నందొకగండశిలయందు రుద్రపాదంబు లేర్పడి తత్పదోపరిభాగంబున నుండి శుద్ధజలంబులు ప్రవహించుటంజేసి భార్యయుం దానుఁ దజ్జలంబులయందు హరహర మహాదేవ యని స్మరించుచు స్నానంబుచేసి కూఁతు వ్రాయిన తెరువెం దున్న దని కొండొకతడవు పరికించి యీఝరంబు పుత్త్రికారణంబున నేర్పడెను గదా యని సంతసించి యచ్చోటు వాసి వచ్చుచు. 12

తే. పుత్త్రి కాదిది మనపూర్వ పుణ్యరాశి
గాక వేఱేది గాదల కమలసూతి
దలఁచి పుట్టించెనో యిట్లు తనయగాను
మనకు నని చెప్పుకొను చిర్వురును ముదమున. 13

వ. ఆపాతాళఝురకూలంబున కేఁగి యచట. 14

పుణ్యవతీచంద్రగుప్తులు సుగ్రీవప్రతిష్ఠితం బగు రాములదేవాయలంబున కరిగి రాములను బూజించుట.

సీ. తొల్లి శ్రీరామచంద్రుండు వాలిని ద్రుంపఁ
బూని సుగ్రీవునిఁ బోరుమంచుఁ
బాసట చెప్ప నప్పగిది సుగ్రీవుఁడు
పోరంగ నవ్వాలి పొగరు మించి
పట్టి నేలం బడఁగొట్ట నామోఁదుల
కోపక పఱతెంచి యొందిలిపడు
చుండు టెఱింగి రాముండు సుగ్రీవుని
కడ కేఁగి యిట్లనెఁ దోడరి మీరు
పోరుచుండఁగ మీరూపు లారయంగ
నొక్కవిధముగ నుండ నేమాని బాణ
మేయ కుండితి నీహేతు వెఱుఁగు మంచుఁ
జెప్ప సుగ్రీవుఁ డప్పుడు చింతఁ బాసి. 15

వ. రామచంద్రుని పదారవిందంబులకు దండప్రణామంబు లాచరించి యి
ట్లనియె. 16

ఆ. రామచంద్ర నీవు రాజవే నిజముగ
రాక్షసాళిఁ ద్రుంప రాజునింటఁ
బుట్టినాఁడ వయినఁ బురుషోత్తముఁడు గావె
గాననే కదా బిఱాన యిట్లు. 17

వ. దయాపరిపూర్ణహృదయంబున నాశ్రితజనరక్షాపరతంత్రుం డని
మొఱఁగింప నాపఱతెంచి వచ్చినయెడకుం జని నన్ను భయంపడకు

మంచు నిజహృదయం బెఱింగించితి వికార్యణంబున నీవు లక్ష్మీ నారాయణుం డంచు నిశ్చయించితి నని యనేకభంగుల నారామ చంద్రునిం గొనియాడి యచటం ద్రిజగద్విదితంబుగ నొకయాల యంబు నిర్మించి యం దాస్వామిని సుఖాసీనుం జేసి "దయాపూర్ణాభి రాముం డ"నునామంబునం ద్రిమూసంబులవఱకుం బలువిధంబులం బూజించె నట్టిదేవాలయంబును జూచి పుణ్యవతీచంద్రగుప్తు లట కేతెంచి యారాముని బూజించి యం దొకరమ్యవననిర్మాణంబు చేయించి మద్యభాండేశ్వరునికడకుం జనికడుభక్తి మెఱయం గాం భోజపురపాలాగ్రేసరుసన్నిధి నుండునొకవార్తాంతికోత్తముని రా వించి యాలయనిర్మాణంబునకు ముహూర్తం బడుగ నా దైవ జ్ఞుండు. 18

తే. అనిమెం బరికించి యీవిభవాబ్దమాఘ
పూర్వదశమిని జలజాప్త పూజ్యదినము
మట్టమధ్యాహ్నలగ్నంబు మహితశుభము
కలుగం జేయు నటంచు భూకాంతుతోడ. 19

చంద్రగుప్తుండు సిద్ధలింగేశ్వరున కాలయంబు గట్టించుట.

వ. అనిన నాధరణీసురేంద్రునకుం బ్రియంబున నానరేంద్రుండు కనకా భరణాంబరంబు లొసంగి పంచి యాలయనిర్మాణకారుల రావించి యమ్ముహూర్తంబున 20

సీ. బహుచిత్రవిరచితప్రాకారపరివృతాం
బరచుంబితోరు గోపురము లొప్ప
మణిమయకల్యాణ మంటపంబులు యజ్ఞ
శాలలు శృంగారశాల లెసంగం
జంద్రకాంతోపల శయ్యాగృహంబులు
దృఢరత్నరచితవేదికలు వఱల
రమ్యసభామందిరంబులు ప్రమథని
శాంతంబులు శతాంగశాల లలరం

త్రిజగదంధకార దినకరబింబమో
యనఁగ గర్భగృహము నందు నవ్య
రత్నకలశ మొప్ప రచియింపఁగాఁ జేసి
కనక మొసఁగి శిల్పకారులకును. 21

వ. సమస్తప్రశస్తోత్సవంబులు సేయించి తత్పూజానియమం బనవరతం
బు భూసురాగ్రేసరులవలన నిర్వర్తించునట్లు చేసి పుణ్యవతియుం
దాను నత్యంతభక్తి నాస్వామినిఁ గీర్తించి యనంతరంబ. 22

చ. అరదము నెక్కి సత్యవతి యందలిసత్యపువృత్తి కొప్ప న
బ్బురపడుచుం బురంబునకుఁ బోయిరి తత్పురవాసు లెల్ల రి
ద్ధరణిపుఁ డాత్మపుత్త్రికను దండన చేయుటఁ గాదె పొందె సు
స్థిరయశముం ద్రిలోకములఁ దెల్లముగా మఱి పార్వతీశునిన్. 23

క. కనులారఁ జూడకుండిన
విన నాతనిపల్కు లెల్ల వీనులకుఁ బ్రియం
బున సీతనిపుణ్యం బే
మని చెప్పను మింకఁ బత్ని యట్టిద చూడన్. 24

వ. అని బహుభంగులం బొగడి రంత. 25

ధ్రువకోకిలవృత్తము. పురము సేరినయంత నాత్మజపుత్త్రు నింగడుఁ బ్రీతిమైఁ
గరము లారఁగ నెత్తి ముద్దిడి కాలకంఠుకృపన్ భువిన్
బరఁగఁ బుట్టినవాఁడవో మముఁ బాయ కోర్పఁగఁ బ్రోతువో
ధర యశంబును దెత్తువో యని ధర్మపత్నియుఁ దా నొగిన్.

వ. ఆబ్బాలుని ముద్దాడిరి నాఁటఁగోలెఁ బుణ్యవతి యాదౌహిత్రునకుం
బ్రతిదినంబును. 27

తే. ముదమునను జలకం బార్చి మోమునందు
భూతిఁ దగఁ బూసి కస్తూరి బొట్టు వెట్టి
లలితభూషలఁ దనువు నలంకరించి
పాలు ఫ్రాయుచుఁ బెంచె నుయ్యేల నుంచి, 28

వ. ఇవ్విధంబునం బెంచుటంజేసి పూర్వపక్షచంద్రుం బోలెఁ బ్రవర్ధమానుం డై. 29

క. అడుగు లిడ నేర్చెఁ దడఁబడఁ
బుడమిం బసువెత్త నేర్చెఁ బొల్పుగ నంతన్
నోడువంగ నేర్చె నగుచుం
గుడువంగా నేర్చె బువ్వఁ గూర్చుండి రహిన్. 30

తే. తోడిబాలురతోఁ గూడి యాడ నేర్చెఁ
దోడరి దినువస్తువుల నెల్లఁ దడుగ నేర్చెఁ
దానుగా భూషణాదులఁ దాల్ప నేర్చెఁ
దప్పు లొప్పులు పరికించి చెప్ప నేర్చె. 31

వ. ఇట్లంతకంతకుం బ్రవృద్ధి నొందుచుఁ బంచాబ్దంబులు నిండుసమయంబునఁ జంద్రగుప్తుండు నిజపురోహితోత్తముం డగు శాంతికుని మున్నిడుకొని యొకముహూర్తంబున సాత్యవతేయుం డనినామకరణంబు సేయించి విద్యారంభదినంబునం బురం బలంకరించి పత్నియుం దాను మహానందాకాంతస్వాంతు లై దౌహిత్రునితోడ మంగళస్నానంబు చేసి దివ్యమంటపంబునం గనకపీఠిఁ గూర్చుండి సంగీతవాద్యవిశేషంబు లొప్పర బ్రాహ్మణాశీర్వచనంబు లానందంబు నొనరింప బంధుమిత్రపురజనంబులు చూడ నాశాంతికునివలన నక్షరాభ్యాసంబు సేయించి యానాఁటనుండి యాతనియొద్ద విద్యాభివృద్ధికి విడుచుటంజేసి యాబాలకుండు. 32

క. గురుపాదయుగళసేవా
పరుఁ డై గురువర్యుఁ డిచ్చు పాఠంబులఁ దాఁ
గరమర్థిఁ జదివి తత్పద
పరమార్థం బడుగు బోధ పడునట్టు లొగిన్. 33

క. ఈరీతి సర్వవిద్యా
పారంగతుఁ డయ్యె నీతి పథ మెఱిఁగె ధరా

భారము వహించు ప్రాయం
బారయ నిండారె షోడశాబ్దము లౌటన్. 34

వ. అంత నొక్కదినంబున మాతామహునిం జూచి సాత్యవతేయుండు దనజననియుదంతంబు సెప్పు మని యడుగుటం జేసి యతం డంతయుం జెప్పె నప్పుడు సాత్యవతేయుండు విస్మయపరీతచేతస్కుం డై మాతామహునానతిం గొని. 35

భాస్కరనదిగట్టున నుండు కాంభోజమహారాజు దనపత్నితోడ వచ్చి సాత్యవతేయునిఁ దనగృహంబునకుఁ గొంపోయి రాజ్య మొసంగుట.

సీ. పరిజనంబులు గొని తురగంబు నెక్కి త
త్సురఘటక్షేత్రముఁ జూడ నరుగ
నచ్చటిజనులు సత్యవతిపుత్త్రుం డని
కడుఁ బ్రియంబున వచ్చి కనుచు నుండి
రపుడు కాంభోజమహారాజునకు నిది
దెలియ నాతఁడు దనదేవితోడ
వచ్చి చూచెను వాని మెచ్చెను రూపలా
వణ్యంబునకు నంత వారి సత్య
వతిసుతుం డెంతయును గారవమునఁ జూచి
మాటలాడఁగ వార లామాటలకును
సంతసం బంది బాపురే జనుల కెల్లఁ
బుత్త్రు లున్నారు వీనితోఁ బోలఁ గలరె. 36

క. అని యాసాత్యవతేయుని
వినయపు వృత్తికిని మెచ్చి వీని మనము దో
డ్కొనిపోయి రాజ్య మొసఁగుద
మనపత్యుల మగుటఁ జేసి యాతనివలనన్. 37

వ. రక్షింపఁబడుచు మనవార్ధకంబున నిమ్మహాక్షేత్రంబునం దుండి కాలంబు గడపుద మని తలంచి సాత్యవతేయుని రమ్మని ప్రియంబునం

బిలువ నతం "డిమ్మహాదేవునిఁ బూజించి పాతాళఝరంబున కేఁగి యందలిజలంబుల మునింగి యావల వత్తు"ననిన నట్లు సేయు మని యాదంపతులు నిజగృహంబున కరిగి రనంతరంబ. 38

సీ. సాత్యవతేయుండు సద్విప్రులను గొని
  సరవిగఁ బాతాళ ఝరముఁ జేరి
తల్లి పోయినరీతిఁ దగఁ జూచి విస్మయం
  బంది సద్భక్తిఁ దానాజలముల
బ్రాహ్మణశ్రేష్ఠులు పావనమంత్రముల్
  సెప్పఁగ స్నానంబు చేసి రుద్ర
పాదంబులకు మ్రొక్కి బ్రాహ్మణోత్తములకు
  నెలమిని దానాదు లెల్లఁ జేసి
జననిపాదాబ్జములఁ జిత్తమునఁ దలంచి
శంకరుం గొనియాడు చాఝరము వెడలి
వచ్చి సుగ్రీవరచితదేవాలయమును
జొచ్చి రాముల సేవించి సొంపు మీఱ. 39

వ. కమనీయంబు లగువనంబులం జూచుచు సిద్ధేశ్వరసన్నిధానంబునకుం జని సహస్రబ్రాహ్మణశిఖామణిపురస్సరంబుగ మహాన్యాసాది మంత్రరాజంబులచే క్షీరాదిబహువిధగంధోదకాభిషేకంబు సేయించి బిల్వాక్షతసురభికుసుమరత్నభూషణాంబరాదుల నలంకృతుం జేయించి ఘృతపక్వభక్ష్యభోజ్యంబులు సమర్పణంబు గావించి తల్లింగంబున కెదురఁ జాఁగిలంబడి యిట్లని ప్రార్థించె. 40

చ. పురహర శంకరా రజత భూధరమందిర బాలచంద్ర శే
ఖర దురితాంధకారరవి గాఢభయార్తజనోపకార భా
సురధవళస్వరూప రిపుసూదన హైమవతీమనోహరా
పరమదయాకరా సుజనవంద్యపదాంబుజయుగ్మ శంకరా. 41

తే. దేవదేవ మహాదేవ దీనపోష
సచ్చిదానందరూప విశ్వప్రకాశ

సకలమునిజనమానస సన్నివేశ
ప్రకృతిసర్పమయూర పురాణపురుష. 42

చ. హర పరమేశ మజ్జననియందు దయారస ముంచినట్లు న
గర మనురక్తిమైఁ గని యకల్మషవృత్తిఁ బాసంగ నిమ్ము స
చ్చరితులపాదసేవనము సంతసముం దగఁ గూర్చు నీపదాం
బురుహములందు నాయెడఁదఁ బొందఁగఁ జేయు శుభప్రదాయకా.

వ. అని బహుభంగులం గొనియాడి యనంతరంబు భూసురోత్తములకుఁ బారితోషికంబు లొసంగి పరిజనంబులతో నిజపురంబునకుం బోవున వసరంబునఁ గాంభోజపురాధీశ్వరుం డగుభద్రసేనుండు సాత్యవతేయునిపోబడి నెఱింగి ప్రియం బారఁ దానేఁగి యక్కానీనుం దన మందిరంబున నుచితస్థానంబునఁ గూర్చుండఁ జేసి పత్నియుం దాను నిట్లనియె. 44

తే. అయ్య మే మనపత్యుల మగుటఁ జేసి
యింక నీరాజ్యపాలనం బే లటంచు
నెంచి సద్రాజపుత్రున కిచ్చి వాని
వలనఁ బోషింపఁబడుచు నీశ్వరునిసేవ. 45

ఉ. చేయుచుఁ గాలముం గడపఁ జిత్తములందుఁ దలంచినార మ
ట్లీయవనిం గనంగ నొకఁడేని సుశాంతగుణోన్నతుండు గా
శ్రీయుతలక్షణుండుగ ధరిత్రిని బాలన సేయువాఁడు గాఁ
బాయని ప్రేమతోడ మముఁ బ్రాపునఁ జేరిచి ప్రోచువాఁడుగాన్.

క. ఇంతకు లభింపమికి మే
మెంతయుఁ జింతించుచుంటి మిపు డాగౌరీ
కాంతునికృప నిన్గంటిమి
సంతోషం బయ్యె మమ్ము సదయతఁ గనుమా. 47

వ. మఱియు వృద్ధులము మే మాసిద్ధేశ్వరస్వామిచరణారవిందంబులం దలంచుచుందు మిఁ కేమి వలసినది లే దంచుఁ దమయభీష్టం బెఱిఁ

గించుటం జేసి సాత్యవతేయుం డూరక యాపల్కు లాలించి తల యూఁచి కొండొకతడవున కావృద్ధదంపతులం జూచి యి ట్లనియె.

మ. వినుఁ డోవృద్ధులు మీయభీష్టము జగద్విఖ్యాతిగాఁ గూర్తు నై
నను మాతామహు లుండ వారిడినయాసనం బాసి వేఱొండు చే
సినచో ధర్మమె వారికిం దెలిపి మీచేఁ గొందు రాజ్య బటం
చని యావృద్ధుల కొప్పఁ జెప్పి మది దుర్గాధీశుని న్వేఁడుచున్. 49

తే. పరిజనంబులఁ దోడ్కొని తురగ మెక్కి
పురమునకు సంతసంబునఁ బోయి యధిక
భక్తి మాతామహులపద పద్మములకు
మ్రొక్కి లిడి మాతృవృత్తాంత మునకుఁ దాను. 50

వ. పరమాశ్చర్యంబు నొంది మీరు మహామహు లని కీర్తించి కాంభోజపురీశుండు సెప్పినవృత్తాంతం బెఱింగించె నంతఁ జంద్రగుప్తుఁడయ్యుదంతంబు విని విస్మయచిత్తుఁడై సాత్యవతేయుం జూచి యి ట్లనియె. 51

తే. అయ్య యెవరేని పిలిచి ప్రియంబుగాను
బుష్పతాంబూలవస్త్రసుభూషణములఁ
రాజ్యమును బుత్త్రినిని నిజరాజతురగ
రథముల నొసంగఁ గొనుట భద్రంబు మఱియు. 52

వ. కాలోచితసిద్ధాన్నంబును బరిపక్వఫలంబులును సస్యాన్వితసుక్షేత్రంబును ధనధాన్యంబులును బూర్ణగర్భధేనువును ఛత్రచామరోష్ణీషంబులును సుగంధవస్తువులును గొనుట పరమయోగ్యంబు గావున నివు డాకాంభోజపురీశునకు "మీయభీష్టబుచొప్పునం బ్రవర్తింతు" నని యొకకమ్మ వ్రాసి చారునిచే నొసంగి పంపుము తదనంతరంబ.

ఆ. మనము మాఖమాసమునఁ బోయి బ్రహ్మోత్స
వంబు సిద్ధలింగభవున కెలమిఁ
జేయ వలయు వారు సెప్పిన ట్లప్పుడు
చేసికొంద మయ్య శివునికృపను. 54

ద్రుతవిలంబితవృత్తము. అనుచుఁ జెప్పెఁ బ్రియంబున నంతఁ దా
విని లలిం దనవృత్తిని నుండె న
జ్జనవరేణ్యుఁడు జాయను జూచి యి
ట్లనియె వింటె సుతాత్మజుఁ డిమ్మెయిన్. 55

తే. చేసికొని వచ్చినాఁ డనఁ జెలఁగి యామె
విని మనోనాథ రాజ్యంబు వేఱొకండు
వచ్చు టది భాగ్యమే కద వసుధ వానిఁ
జేయఁడే రాజులకు మేటి శివుఁడు కృపను. 56

వ. అని దౌహిత్రునియదృష్టంబునకుం బరమామోదంబు నొందుచుం
డె నివ్విధం బుండఁ గొన్నాళ్లకు మాఘమాసంబు వచ్చుటం జేసి చం
ద్రగుప్తుండు నిజపరివారంబును గొని భార్యను దౌహిత్రునిం గూడి
రథం బెక్కి సురాఘట క్షేత్రంబునకుం జని క్రమంబుగ సిద్ధేశ్వరును
త్సవాదులు చేయించి మగుడ వచ్చుసమయంబునం గాంభోజపురీశుం
డు గాంచి. 57

{ కాంభోజపురాధిపతి యగు భద్రసేనుఁడు సాత్యవతేయున
కుఁ దనరాజ్యం బొసంగుట. }

తే. చంద్రగుప్తునికడ కేఁగి సత్ప్రియంబు
దనర నరనాథ నా గృహంబునకు మీరు
వచ్చి మదభీష్టమును దీర్ప వలె నటంచుఁ
జెప్ప నాచంద్రగుప్తుండు చెలఁగి యపుడు. 58

వ. అందఱుం దోడ్కొని యాభద్రసేనునిమందిరంబున కేఁగ నతం
డవ్వారి సగౌరవంబునఁ గూర్చుండఁ జేసి సాత్యవతేయునకు మదీ
యరాజ్యం బొసంగ నిశ్చయించితి నందుల కతఁ డంగీకరించితి నని
యొక లేఖ మీయానతిఁ బడసి లిఖించి పంచె మేము వృద్ధు లగు
టం జేసి కాలం బూరక గడపు టుచితంబుగాదు యముండు కరుణ
లేఁడు గావునఁ బరమేశ్వరు నారాధించుచుం బరలోకంబు గన వల
యు మీ యిష్టం బేక నవినఁ జంద్రగుప్తుం డి ట్లనియె. 59

చ. జనవర ప్రీతిఁ బ్రోచు మిము సాత్యవతేయుఁడు మీయభీష్టముం
గొని మఱి మాకు సమ్మతముఁ గూర్చును గావున నట్లు చేయుఁడం
చనఁగఁ బురోహితోత్తముని నప్పుడు రమ్మని లగ్న మొండు గ
న్గొనుఁ డనఁ జూచి యిట్లనియెఁ గూర్మిగ నాతఁడు రాజవర్యుతోన్.

వ. మూఁడవదినంబునరుణోదయకాలంబు పట్టాభిషేకాది కార్యంబులకుఁ గడుశుభం బనియె నంత నాభద్రసేనుఁ డాసుదినంబునఁ బుణ్యవతీ చంద్రగుప్తులకు సాత్యవతేయునకు మంగళస్నానంబు సేయించి నూతనవస్త్రభూషణాదుల నంకృతులం జేసి దా మట్లు సుస్నాతులై నవవస్త్రధారు లగుచుం బురోహితోత్తమ పురస్సరంబుగ సాత్యవతేయుని నిజపుత్త్రుంబోలె సంకల్పించి సకలజనంబులు చూచి సంతసింపఁ దమరాజ్యం బొసంగి మంగళవాద్యంబు లొప్పార వరవారణారోహణునిం జేసి పురంబునం బ్రసిద్ధంబుగ నుత్సవంబు సేయించె నంత సాత్యవతేయుండు మాతామహీమాతామహులకు నభిమానజననీజనకు లగుభానుమతీభద్రసేనులకుఁ బ్రియంబుగఁ బ్రణామంబు లాచరించి వారిశుభాశీర్వచనంబులం గొనియె నంత భద్రసేనుండు పురోహితాదిజనంబులకు నుచితసన్మానంబులు చేసి పంచి నాఁటఁగోలె రాజ్యపాలనంబు వదలి సుఖం బుండె నంత సాత్యవతేయుండు మాతామహీమాతామహులను సిద్ధవటపురంబునకు నంపి కాంభోజపురిపాలనంబు సేయుచు భానుమతీభద్రసేనులం గాపాడుచుఁ గొన్నాళ్లుండి మంత్రియందు రాజ్యభారంబు పెట్టి భానుమతీభద్రసేనులం దోడ్కొని స్వపురంబునకుం జని యాభానుమతీభద్రసేనుల మాతామహీమాతామహులను ముదంబునఁ దనరం జేయుచుండ నొక్కనాఁడు చంద్రగుప్తుండు దౌహిత్రునిం గూర్చి భార్య యగు పుణ్యవతితో ని ట్లనియె. 61

## చంద్రగుప్తుఁడు దౌహిత్రుని యౌవరాజ్యాభిషిక్తునిఁ జేయుట.

చ. సకలకళాప్రవీణుఁ డగు సాత్యవతేయుని యౌవరాజ్యనా
యకునిఁగఁ జేయ నెంచితిఁ బ్రియంబుగ నీ కిది సమ్మతంబె యూ

రక యిఁక నుండు టేల యన రాణి ముదంబునఁ జెప్పె నిట్లు వే
ఱొకసుతుఁ డున్న వాఁడె మన ముర్వికి నాథునిఁ జేయ వల్లభా. 62

ఉ. కావున దీని కే నొకటి గాదని సెప్పుట యుండు నే యశ
శ్శ్రీ వెలయంగ నల్లె యభిషిక్తునిఁ జేయు మనంగఁ జంద్రగు
ప్తావనినాథుఁ డంత విబుధాళి సభాభవనంబుఁ జేర్చి తా
భావ మెఱుంగఁ జేసె విని పల్కిరి వారలు జేని కిమ్మొయిన్. 63

తే. రాజ దౌహిత్రునకు యౌవ రాజ్య మిచ్చి
సుఖముగా నుండఁ దలఁచుట శుభము గాదె
యనుచు సుముహూర్త మొక్కండు గని నరేంద్రు
నకు నెఱింగించి రాసులగ్నమున నతఁడు. 64

వ. పురంబు నలరికరింపఁ జేసి బంధుమిత్రజనంబులను సకలరాజన్యులను సగౌరవంబున రావించి మంగళగీతవాద్యంబు లొప్పారఁ బుడమివేల్పు లాశీర్వదింపఁ బురోహితవరేణ్యపురస్సరంబుగఁ దా నా సాత్యవతేయునకు శిరంబునం గిరీటంబు వెట్టి కరంబున ఖడ్గం బొసంగి యువరాజుం జేసె నాఁటఁగోలె సాత్యవతేయుండు మాతామహీమాతామహులకును దనయభిమానజననీజనకు లగుభానుమతీభద్రసేనులకును సకలసౌఖ్యంబుల నొసంగుచుం గడుముదంబున రాజ్యభారంబు వహించి యుండ నొకనాఁడు సభాభవనంబునఁ బేరోలగం బుండుసమయంబున. 65

### సాత్యవతేయునికడకు సూర్యుండు విప్రవేషంబున వచ్చి హితోపదేశము చేయుట.

క. తన తేజంబున వెల్గెడు
తనయునికడ కేఁగి రాజధర్మంబుల నె
ల్లను జెప్పి వత్తమని వి
ప్రునిరూపము దాల్చి భాస్కరుఁడు సంప్రీతిన్. 66

క. చను దెంచి పుత్త్రవర్యునిఁ
గనుఁగొని దీవింప నతఁడు గద్దియ డిగి వి

ప్రునిపదపద్మములకు వం
దనముల నొగిఁజేసి భక్తి దనరారంగన్. 67

వ. పసిండిపీఁటయందుఁ గూర్చుండఁజేసి వినయంబు మెఱయ నమ్మాయా
విప్రునకు నిట్లనియె. 68

తే. భూసురోత్తమ తొల్లి నేఁ జేసినట్టి
పాపపుంజంబు భవదంఘ్రి పద్మరజము
వలనఁ బాసెను బరమపావనుఁడ నైతి
ననుచుఁ గొనియాడుచుండఁ బ్రియంబు మీఱ. 69

చ. జలరుహమిత్రుఁ డిట్లనియె సాత్యవతేయ ననుం బ్రియంబునం
బలుకుచు గారవించుటను బట్టి ముదంబును జెందితి న్మహీ
తలమున సద్వివేకులకు ధర్మ మిదే కద యంచు నింక నా
తలఁ పెఱిఁగింతు నీ వ్వైకఁడు దప్ప మఱెవ్వరు నుండ రా దిటన్.

వ. అని చెప్పుటం జేసి సాత్యవతేయుం డత్తఱి సభాంతరాళంబున నుం
డుజనంబులం బ్రియంబున ననిచి యేకతం బుండుసమయంబు నమ్మా
యాదివాకరుం డిట్లనియె. 71

సీ. విను సత్యవతియందు వేడ్కమై నే నిన్నుఁ
గనినాఁడ నేదివాకరుఁడ నీకు
జనకుండఁ బుత్త్రివాత్సల్యంబు నెగడంగ
సరవి హితోపదేశంబు సేయ
వచ్చినాఁడను విప్రవరుఁ డని తలఁపకు
నాపల్కు లన్ని మనసున నుంపు
మని చెప్పఁ దొడఁగె నెయ్యంబునఁ బ్రియపుత్త్రి
జగతిరాజుల కెల్ల సత్వగుణము
వలయు మఱి నీవు బాలుఁడు వసుధశత్రు
వులకుఁ గాలాంతకుఁడుఁబోలెఁ జెలఁగి ధాత్రి
పాలనము సేయ నోపవు భద్రయశముఁ
బొందుమార్గం బెఱుంగవు పోహాణముగ. 72

వ. కావున నీ విప్రప్రధానంబైన కుమారా చరణంబు సేయుమద్దానివలనం బ్రపుణ్యంబును సద్యశోధనంబును బంధుమిత్రప్రపూజ్యతయును సదసద్వివేకంబును రాజ్యసుఖంబును శాత్రవజయంబును దురతిక్రమక్రియాసాధనంబును సకలరాజన్యవశీకరణంబునుం గలుగు నాశాంతంబు లేనిచో సర్వకార్యంబులు సెడు నని వెండియు ని ట్లనియె. 73

ధ్రువకోకిలవృత్తము.

సరసం జేరి ప్రియంబుఁ బుట్టఁగ ♦ సంస్తవం బొనరించు దు
శ్చరితులం గడుదూరమం దిడు ♦ సద్బుధావళితో నిరం
తరముఁ గూడు సభాస్థలిన్ నృప ♦ ధర్మపాలన సేయు నీ
శ్వరపదాబ్జము లాత్మ నెంచుము ♦ వార కెప్పుడుఁ బుత్త్రకా. 74

చ. మనకు సమానుఁ డెవ్వఁ డిల ♦ మానవనాథులలో నటంచు నా
మును బడఁ బోకు సజ్జనస ♦ మూహము నెప్పుడు ప్రేమఁ జూడు మే
జనములఁ గాని దూఱకుము ♦ సఖ్యము సేయకు క్రొత్తవారితో
ననయము ధైర్యము న్విడకు ♦ నాలమునన్ రిపుతోడఁ బోరుచోన్.

క. సేవకులను బుత్రులుగా
భావింపుము దూఱ కెపుడు ♦ భయపడి నిన్నుం
బ్రోవు మని వేఁడుజనములఁ
గావుము బంధువులఁ బేర్మిఁ ♦ గనుము కుమారా. 76

తే. భూసురోత్తములను ♦ భూషింపు మెప్పుడుఁ
దనరఁ బాత్ర మెఱిఁగి ♦ దాన మిమ్ము
ఎట్టి కార్యమైన ♦ నెసలార యోచించి
చేయు దాన మేలు ♦ చెందుఁ జుమ్ము. 77

చ. పరమరహస్య మెవ్వనికిఁ ♦ బ్రాణసఖుం డని చెప్పఁ బోకు స
ద్గురువచనానుసారముగఁ ♦ గూర్మిఁ జరింపుము పేదవాండ్ర సా
దరమున నేలు దీనుల కు ♦ దారత నుండుము మంత్రివర్యులం
గర మనురక్తిమైఁ గను మ ♦ కాలమునం దెట కేని పోకుమా. 78

ఉ. కాల మెఱింగి పల్కు నిజకార్యములందు సుశీల గూడ దే
యాలము సేయ కెంతయు ధనార్జన మీ వ్రవరింపు కాఁపు లా
నేలిక మాకు దేవుఁ డన నేలుచుఁ బన్నులు దీయు మారకే
కాలము పోఁ జరింపకు సుఖప్రదమార్గ మెఱుంగు పుత్త్రికా. 79

చ. అడిగిన పేదవారలకు నప్పుడ తోఁచినవిత్త మిమ్ము నీ
వడఁకువ మంచి దెప్పు డొగినమ్మియిఁ జేయక రేపు మాపటం
చిడికొన రాదు గర్వము వహింపకు దాన మొసంగువేళ నీ
విడినది చాల దం చడుగ నించుక మెచ్చుగ నిచ్చి పంపుమా. 80

ఆ. స్వకులనిందకులను వరవేదశాస్త్రపు
రాణదూషకులను రహిని భూసు
రోత్తమాళిజీవనోపాయముల వన
కూపములను జెఱచు క్రూరమతుల. 81

ఆ. బధిరమూకవృద్ధ పంగునిర్ధనజను
పాంధజనుల గేలి సల్పువారి
నించుకేని కరుణ నెంచక శిక్షింపు
దానఁ దప్పు లేదు తనయ నీకు. 82

తే. అగ్నిసాక్షిగ నుద్వాహమై సుఖంబు
నొసఁగుభార్యాలలామంబు నుల్ల మలర
నుండు మించుక దుఃఖంబు నొందఁ జేయ
కందుచేఁ గీడు వాటిల్లునయ్య వింటె. 83

తే. మఱియుఁ బరభార్యఁ గోరకు మహితసాధు
జనులఁ గూడుము వినయము సత్యవాక్కు
మానకుము గౌరవాసక్తి దీనబంధు
పోషణము సేయు పెద్దల పూజ విడకు. 84

వ. ఇదియునుంగాక కళింగరాజేంద్రునిపుత్త్రి నీకుఁబరిణయం బగు దాని
యందు సత్సంతానంబు వడసి మాతామహీమాతామహులను

భానుమతీభద్రసేనులను రక్షించుచు సుఖం బుండు మంచు విధిపూర్వకంబుగ నరుణాస్త్రం బనుమంత్రరాజంబు నుపదేశించి యిఁక నేఁ బోయి వత్తుననిన నాసత్యవతీసూనుఁ డత్యంతభక్తిమై నమ్మాయాదివాకరునిచరణారవిందంబులకుం బ్రణమిల్లి యిట్లనియె. 85

తే. గురువరేణ్య భవత్పదసరసిజములఁ
దలఁచినప్పుడ నాకు సుదర్శనంబుఁ
గరుణ నొసఁగుము భవదాజ్ఞఁ దిరము గాను
జిత్తమున నుంతు ననినట్లు చేసెద నని. 86

చ. తరమిడి విప్రవేషుఁ డగుతామరసాప్తుఁడు వోయె నంతఁ దా
నురుతరభక్తి నాతనిహితోక్తులు చిత్తమునందు నిల్పి ధీ
వరు లగుమంత్రులం గలసివారక రాజ్యము నేలుచుండె దు
శ్చరితులగర్భశత్రు వయిసజ్జనకల్పమహీజ మై భువిన్. 87

వ. అమ్మాయి నుండుటం జేసి పుణ్యవతీచంద్రగుప్తులును భానుమతీభద్రసేనులును సాత్యవతేయునకు వివాహంబు సేయం దలంచి రాసమయంబునం గళింగవిషయాధీశుండు నిజకుమారికారత్నం బగుచారుమతికి స్వయంవరమహోత్సవదినంబు నిర్ణయించి సకలరాజన్యకుమారులకు శుభరేఖలు పనుపుటం జేసి చంద్రగుప్తునికడకు. 88

క. మన మార విప్రుఁ డొక్కఁడు
చని తచ్ఛుభరేఖ యొసఁగి చారుమతీరూ
పనియతి పొగడెం బ్రేముడీ
తనరారఁగ నతడు సమ్మదస్వాంతుం డై. 89

కళింగదేశాధిపతి చంద్రగుప్తునికడకుఁ బుత్త్రికా స్వయంవరలేఖను బంపుట.

క. వరభూషణాంబరంబులు
పరమానందంబు నొందిపసదన మాభూ
సురవరుని కొసఁగె నాతం
డరిగెం గైకొని ముదమునవలరుచుఁ బురికిన్. 90

వ. అంతఁ జంద్రగుప్తుండు పుత్త్రికాగమనం బంతయు నింట నెల్లర కె ఱింగించి యామూహూర్తంబునకు సాత్యవతేయునిఁ బంపుటకు నిశ్చ యించి యుండె. 91

ఆశ్వాసాంతము.

క. పరమామ్నాయచతుస్సా
గరపరివృతప్రణవదేశ కలితా వి త్తే
శ్వరమిత్రా భూతేశ్వర
ద్విరదాననగురువరేణ్య వృషరాడ్తురగా. 92

స్రగ్విణీవృత్తము. శ్రీమహాదేవ గౌరీశ్వరా శంకరా
సామగానప్రియా చంద్రమౌళీశ్వరా
కామితార్థప్రదా కాలకంఠా భవా
కామవిద్వేషణా కాల మృత్యుంజయా. 93

గద్యము.

ఇది శ్రీమదాలూరువంశపయోధిరాకామృగాంక రామ
కృష్ణదైవజ్ఞపుత్త్రి సుజనవిధేయ వాసుదేవనామ
ధేయప్రణీతం బైన శ్రీసిద్ధేశ్వరీయం
బనుమహాప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము.

సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

# శ్రీసిద్ధేశ్వరీయము.

## పంచమాశ్వాసము.



మత్సనకాదిముని
స్తోమాలంకృతసభేశ । తుహినాచలక
న్యామణికైరవ చంద్ర మ
హామహిమా మద్యపూరి । తార్ద్రిఘటేశా. 1

తే. అంత మునులార చంద్రగు । ప్తావనీశుఁ
డాస్వయంవరదినమునం । దతిముదమునఁ
దనదుదౌహిత్రు నోగిఁ బరి । జనులతోడ
నాకళింగాధిపతిపురి । కనిచె నచట. 2

వ. కళింగదేశాధీశ్వరుండు పురం బలంకారంబు సేయించి స్వయంవరంబునకు వచ్చురాజకుమారులకు మందిరంబులు నిర్ణయించినవాఁడయ్యె నాసమయంబున. 3

సీ. గౌళబంగాళనే । పాళచోళేశులు
పౌండ్రకమళయాళ । పాండ్యపతులు
కోసలపాంచాల । కుంతలనేతలు
కేరళసాళ్వాది । భూరమణులు

ద్రవిడోత్కళాంధ్రమా ॥ ళవమత్స్యసోధులు
లాటకర్ణాటవ ॥ రాటపతులు
కాశ్మీరసౌవీర ॥ గాంధారనృపతులు
ఘూర్జరబర్బర ॥ కుకురుధవులు
మద్రకొంకణకరహాట ॥ మగధనిగధ
శబరకేకయబాహ్లీక ॥ శకవిదేహ
కొంకణావంతిసౌరాష్ట్ర ॥ కురువిదర్భ
చేదివత్సమహారాష్ట్ర ॥ సింధువిభులు. 4

కళింగరాజపుత్త్రికా స్వయంవరంబునకు వచ్చినరాజకుమారుల గౌరవంబున విడుదులను జేర్చుట.

క. చను దెంచిరి తమతమపరి
జనములతో నాకళింగ ॥ జనపతి వారిన్
ఘనతం దోడ్తెచ్చుటకుం
దనబంధుపురోహితప్ర ॥ ధానులతోడన్. 5

క. సంగీతవాద్యములతోఁ
బంగరుపళ్లెరములందు ॥ ఫలపుష్పాదుల్
బంగరుపచ్చడములు గొని
పొంగుచుఁ దద్రాజవర్య ॥ పుత్త్రులకడకున్. 6

వ. పోయి పురోహితపూర్వకంబుగ విచ్చేసినరాజకుమారరత్నంబుల కందఱకుఁ గురంగనాభసమన్వితచందనామోద పుష్పదామంబులను వివిధమధురఫలంబులను గనకమణిమయభూషణాంబరాదుల నొసంగి సగౌరవంబున నెల్లరం దోడ్కొనివచ్చుచుండ నాపురవరంబున.

తే. ఎందుఁ జూచినపచ్చని ॥ పందిరులును
దుఱఁగలించెడుముత్యాల ॥ తోరణములు.
వివిధఫలపుష్పవల్లరీ ॥ విలసితేక్షు
దండసంయుతకదళికా ॥ స్తంభములును. 8

క. చెలఁగెడుసదనద్వారం
బులు క్రప్రుముగ్గు లొలయు । భూతలములు రం
గులు మీఱుచిత్రపటములు
చెలువారుచు నుండెఁ గలిమి । చెలి కాలయమై. 9

వ. అంత రాజు రాజపుత్త్రిలం దోడ్తెచ్చి యుచితసుందరమందిరంబులం
జేర్చి తనకార్యంబుల నుండె నయ్యవసరంబున. 10

{ చారుమతి సురూపగుణాన్వితరాజకుమారు నొక్కని నేర్పు
మెఱయించి చూచి రమ్మని మోహనవల్లిని బంపుట. }

ఉ. రాజకుమారి చారుమతి । రాజకుమారులరాకఁ జూచి యా
రాజకుమారులందు రతి । రాజును బోలి ప్రశస్తశీలవి
ద్యాజవసత్త్వధైర్యనిపు । ణాన్వితుఁడై సుగుణాఢ్యుఁడై మహా
రాజకులప్రసూతుఁ డయి । రాజిలువానిని నేర్పు మీఱఁగన్. 11

వ. పొడగాంచి రమ్మని మోహనవల్లి యనుచెలికత్తియను బంపుటం
జేసి యది రాజకుమారులవిడుదులకడ నిల్చి పూబంతులు గట్టుదాన
నని పలుకుటం జేసి పాంచాలభూవిభుండు విని యిట్లనియె. 12

ఆ. పూలదండ లంద । ముగఁ గట్టుదానవె
యెందునుండి నేర్చి । తీవు చెపుమ
యనఁగ రాజు లిండ్ల । ననయ మిప్పని సేయు
దాన నడుగు టేల । ధరణినాథ. 13

క. అని నుడువఁగ విని యమ్మొయిఁ
దనరారఁగఁ గట్టు మెల్లి । ధరణిపుత్త్రిం
గనువేళ వలయు నన మో
హనవల్లి యదే విధమున । నందం బెసఁగన్. 14

వ. పుష్పదామంబులం గట్టి యొసంగె నద్దాని రాజకుమారులు చూచి
ముదం బంది రాసమయంబున నెల్లఱేండ్లం జూచె నందు సాత్యవతే
యుండు నక్షత్రప్రకరంబునఁ జంద్రుంబోలె నుండుటం జేసి తనమన
మ్మున. 15

ఉ. ఈరమణీయరూపుని మహేశుఁడు మన్మథు రూపు మాపి యం
భోరుహగర్భుచే మఱల భూతలమం దిటు పుట్టఁ జేసె నో
చారుమతీవిభుండుగ విచారము లేటికి నింక దానితో
భూరిముదంబు మీఱఁగను బోయి వచించెద నైన నేర్పడన్. 16

ఆ. ఎవ్వ రెఱుఁగ కుండ నీతనివృత్తాంత
మెఱుఁగవలయుఁ గడకు నేఁగి యంచు
నచటనుండి వత్తునని చెప్పి ఱేఁడుల
ముదలఁ బొంది వచ్చె ముదము నెగడ. 17

వ. అట్లుచితకాలంబున లేచి సాత్యవతేయునివిడిదికిం జని యతనికి దండంబు లిడి యిట్లనియె. 18

క. చాగుమతీసఖి సగుదును
గారవమునఁ బుష్పమాలికలు గట్టుచు నే
భూరమణుఁడు శుభలక్షణుఁ
డై రాజిలు నట్టివాని నరయుట కెలమిన్. 19

క. చారుమతి పంప వచ్చితి
నో రాజకుమార యనఁగ నుల్లానముతో
నా రాజపుత్త్రిలక్షణ
మారయ నా కెఱుఁగఁ బల్కు మని యడుగఁగఁ దాన్. 20

వ. చారుమతీశుభలక్షణంబులు ప్రియంబు గదుర వక్కాణింప నాసాత్యవతేయుండు విని మహానందంబు నొంది మోహనవల్లితో ని ట్లనియె. 21

అంబురుహవృత్తము.

అందఱ రాజకుమారులఁ జూచితె యందు నెవ్వరు దానికిం
బొందువడుం బరువంబుగఁ జెప్పుమ బొంకకుండ ననంగ నా
సుందరునిం గని వల్కె నగోత్తమ చూచినందఱిలోఁ బ్రియం
మ్నొందెడు నీపయిఁ గావున వచ్చితి నుల్లసిల్లుచు నే నొగిన్. 22

వ. భవద్వంశోదంతంబు సంగ్రహంబుగ నెఱింగింపుఁ డేను బోయి చారుమతి కెంతయు ననురాగం బుదయింప నుడివెద ననవుడు నాసూర్యపుత్త్రిం డొకపత్రికయందు. 23

చారుమతికి సాత్యవతేయుండు తనవృత్తాంత మొకపత్రికయందుఁ బనుపుట.

సీ. మగధదేశాధీశుఁ డగుచంద్రగుప్తమ
హీతలేంద్రునకు దౌహిత్రుఁ డేను
వసియించుపురి సిద్ధవటము ప్రభాకర
శర్మ నాదేశికసత్తముండు
జనులు సాత్యవతేయుఁ డని నన్నుఁ బిల్తురు
విబుధపూజనమె చూవృత్తి నాకు
సత్యమృదుత్వశౌచశ్రీలు గలయువ
తిం బెండ్లియాడఁ జిత్తంబునందుఁ
దలఁచియున్నాఁడ నింతకు జలజభవుని
తంత్ర మెట్లున్నదో యది తఱి నెఱుఁగఁ
బడుఁ గదా యైనఁ జంద్రునిఁ బరముదమునఁ
గోరదే చక్రవాకంబు గూర్మి నెపుడు. 24

క. అని యిట్లు వ్రాసి యమ్మో
హనవల్లికరమున నిడఁగ నది కడుమోదం
బును బొంది దాని నొడి నిడి
కొని చేనికిఁ జెప్పి ముదలఁగొని తా నంతన్. 25

ఆ. పోయి చారుమతికిఁ బొందుగ దాఁ జేసి
నట్టికార్యములఁ బ్రియమున నుడివి
కమ్మఁ జేత నొసఁగఁ గని దానిఁ జదివి యి
ట్లనియెఁ బొలఁతి నెయ్యమార నపుడు. 26

క. ఈపత్రిక లిఖియించిన
భూపాలునిముఖసరోజముం జూచితె త

ద్వీపమునకు సదృశుం డే
భూపాలుం డొండు లేఁడె | పోల్పఁగ ననఁగన్. 27

ఉ. మోహనవల్లి యి ట్లనియె | మోహము పుట్టఁగ రాకుమారి క
న్మోహనమూర్తితో సదృశ | మూర్తిగ జేఁ డొకఁ డొండు లేఁడ యు
త్సాహము గల్గదే యతని | చక్కఁదనంబును జూడ మన్మథుం
డాహరుచేత రూపు చెడె | నం చిలఁ బల్కుట దబ్బరల్ సుమా. 28

ఆ. అతనిరూపునకు హి | మాంశుఁడు లజ్జచేఁ
గొన్ని నాళ్లు మఱఁగి | కొన్ని నాళ్లు
సత్వగుణము చూపి | చనవుమై వెల్గెడు
నంచుఁ జెప్పవచ్చు | నమ్మ చూడ. 29

క. అని బహుభంగులఁ బొగడుచు
మనసారఁగఁ జేసెఁ జారు | మతి కారాజేం
ద్రునిమీఁద వలపు రాసుత
తనకరమున నుండుకమ్మఁ | దలకొని మఱలన్. 30

తే. చదువుకొను చుండునపుడు గ్ర | చ్చుఱ నెడఁదఁ
దోఁచె నయ్యారె నాతల్లి | తో నొకప్పు
జనకుఁడు వచించెఁ గద యట్టి | చంద్రగుప్త
నృపతిదౌహిత్రుఁ డితఁడొకొ | నిజము గాను. 31

వ. అదియునుంగాక. 32

క. సత్యవతీసుతుఁ డగుటను
సాత్యవతేయుఁ డని పేరు | సమకూడె మఱా
దిత్యునికృపఁ దాఁ గల్గుట
సత్యంబ ప్రభాకరుండు | సద్గురుఁ డగుటన్. 33

వ. అట్టిమహానుభావుండు నాకు భర్త యగుట నాపూర్వసుకృతంబ మఱియు నతనిగుణరూపవిద్యాశీలాదు లింకఁ బరిశీలింపఁ దగ దని వెండియు నిట్లు తలంచె. 34

తే. చక్రవాకంబు గోరదె ♦ చంద్రురాకఁ
గూర్మికొలఁ కని ప్రాయుటఁ ♦ గోర్కి యతని
కెంత నాపయి నుండునో ♦ యెడఁద నింత
కీశ్వరుఁడు నన్నుఁ గూర్పఁడె ♦ యెల్లి యంచు. 35

వ. కొంతవడి తలపోసి మోహనవల్లి యొనర్చిన నేర్పునకు సంతసించి దా
నితో ని ట్లనియె. 36

మత్తకోకిలము. ఎల్లి మోహనవల్లి నా కవ ♦ నీశ్వరుల్ పొడచూపుచో
నెల్లవారలఁ జూచు చూరక ♦ యేను వత్తును వెంట నా
యుల్ల మారఁగ నీనృపాత్మజు ♦ నొద్ద నేరుపు నింపు సం
ధిల్లఁ బల్కుచు నిల్వు మీతని ♦ తీరు చూడ వలెం దగన్. 37

వ. అని మోహనవల్లికి మున్నడి నియమించె నంత. 38

—●●◆ చంద్రోదయవర్ణనము. ◆●●—

తే. శాత్రవుం డగుభానుండు ♦ చరమదిశకు
నరిగె భయమేమి యిఁక నా క ♦ టంచు మించి
తిమిరదైత్యుండు వచ్చెనో ♦ తిమురు చనఁగ
నలువలంకులఁ దిమిరంబు ♦ బలిసె నపుడు. 39

తే. అంతకంతకుఁ బూర్ణామృ ♦ తాబ్ధిలోని
భూరిరంగ త్తరంగముల్ ♦ పొంగి నింగి
కెగసెనో యనఁ బ్రాగ్దిశ ♦ నెసఁగె వెల్ల
మిసిమి యామీఁద దెస లెల్ల ♦ మించె నంత. 40

క. చెలువారఁ బులోమజ సా
మ్ములు దాలిచి తనయొయ్యార ♦ మ్ముం జూచుటకుం
దొలిదిక్కు మేడముంగల
నిలిపినదర్పణ మనంగ ♦ నెల యొగిఁ బొడిచెన్. 41

వ. అయ్యవసరంబునం జెలిక త్తియల నందఱుం బ్రియంబునం బోయి భు
జించి రం డనిన వా రేఁగి రంత సౌధోపరిభాగంబునకుం జని పండు

వెన్నెలయందొక్కెడం బఱచినమృదుశయ్యను జేరి సాత్యవతేయుని
వలన నెగడుమదనానలంబునకు సహింప నేరక. 42

### మన్మథదూషణము.

ఉ. దండనసేయ కుండఁ దలిǂదండ్రులు ముద్దుగఁ బెంచి రట్లు లే
కుండినచో ననీతుఁ డయిǂయుత్కటగర్వము నొంది పుష్పకో
దండము వట్టి యిమ్మెయి నెǂదం గుసుమాంబక మేయఁ బూనితే
దండు కెలంకులం గొలువఁǂదార్కొని నిర్దయతన్ రతీశ్వరా. 43

తే. వావి వరుసలు లేకుండఁ ǂ గావరమునఁ
గుసుమబాణంబు లేయంగఁ ǂ గూర్మిపతుల
జిహ్వావక్షోర్ధతనువులం ǂ జేరి గోలి
భారతీందిరాగౌరులు ǂ క్రూరమతుఁడ. 44

చ. అనుపమరూపయౌవనముǂలం దనుభోగమునందు సాటి యై
దనరురతీసతీమణిని ǂ దర్పక పాసి చలంబు మై ననుం
జెనకుట పాడియే శివుని ǂ చే నశియింపఁగఁ జేయుమన్ వెసం
జను మిఁక బాపురే యిటులుǂచానల నేఁచిన మేలు గల్గునే. 45

### చంద్రదూషణము.

తే. అనుచుఁ గుసుమాంబకుని దూఱు ǂ నపుడు మింటఁ
జుఱుకువెన్నెలఁ జంద్రుఁడు ǂ నెఱయఁ గాయఁ
జారుమతి దాని కోపకǂచంద్రుఁ జూచి
తొడరి యూస్సజ్జఁ బాయక ǂ దూఱె నిట్లు. 46

తే. ఓరిదోషాకరా సుకుǂలోదయుండ
వయ్యు నించుకదయ లేక ǂ యంగజునకు
జోక వైతివి గదర దోǂషాకరుండ
నంగ నీ కిల సార్థక ǂ నామకంబ. 47

తే. పుట్టితివి పాలకడలి ǂ నీపుట్టుక సెడ
దానఁ బుట్టిన గజకామǂధేనుకల్ప

కావనీజసుధాకాస్తు భాదు లతుల
గుణములం గాంచె నీ కట్టి గుణము లేడ. 48

తే. కలఁకుఁదురకలదేవర గాక యున్న
గురునియిల్లాలితోఁ బొందు కూళ భూమి
తలమునం దొక్కఁ డున్నాఁడె ధర్మవృత్తి
మానిబాపురే నీ కిది మంచి దగునె. 49

తే. అపుర తోఁబుట్టునింటిని నైనఁ బ్రేమఁ
జూడ నోపినవాఁడవె శూలపాణి
పరఁగ నీశాంతకాంతిఁ బుష్పంబు కరణి
శిరమున ధరించికద కోప చిత్తుఁ డయ్యె. 50

క. పెనుఁబాపఱేఁడు నిను బ్రిం
గినయప్పుడు మాంత్రికు లాగిఁ గృపమై విధిచా
ప్పనఁ దన్మంత్రములు పఠిం
చినకతనం బ్రదికి యిట్లు చెనకెద వకటా. 51

తే. అంచుఁ జంద్రుని నిందించు నపుడు మరుఁడు
కుసుమబాణంబు లురమున నెసఁగఁ బొంచి
యేయఁ దనపాన్పుపై సొమ్మపోయె నంతఁ
జెలులు గొందఱు డగ్గఱఁ జేరి యెలమి. 52

వ. మృగమదఘనసారమిళితమలయజంబు పైనలంది వీవనలం గొని
విసరి రప్పు డారాచపట్టి నిదురించి మేల్కాన్న చందంబున లేచి మో
హనవల్లిం జూచి యి ట్లనియె. 53

క. చెలియా సాత్యవతేయుని
చెలువంబుం జూడఁ గోరెఁ జిత్తము నా కా
చెలువునిఁ గూర్చునె పల్కుల
వెలఁదిమగం డెంచి యంచు వెండియు ననియెన్. 54

వ. మదనానలంబున కొడలు తాళ నోపకున్నది యేమి సేయుదు ననిన

నప్పడంతి యప్పుడు పాలోగిరంబును బసిండిగిన్నె నిడికొని వచ్చి
యి ట్లనియె. 55

మత్తకోకిలము.

అమ్మ తెమ్మిది యారగింపు ప్రియంబునం గమలాసనుం
డమ్మహీపతి కీవు భార్యగ నర్థిఁ గూర్చును బో నిజం
బిమ్మెయిం బలుమాఱు నూరక యేల నెంచెదు వర్ధరా
త్రమ్ము మీఱె ననంగ నావర రాజపుత్రిక లేచి తాన్. 56

తే. దాని నించుక భుజియించి తల్పమునను
జెలులు బాదంబు లొత్తంగ నెలమి నిదురఁ
జెంది సాత్యవతేయుని జేరినట్లు
గంటిఁ గల యేమి చిత్ర మి క్కల నిజంబె. 57

వ. అని చెలులం జూచి చెప్పుచు నుండుసమయంబున. 58

### సూర్యోదయావర్ణనము.

సీ. కమలషండమునకుఁ గల్గె సమ్మోదంబు
గలువలగరగరికంబు తగ్గెఁ
గోదమ తేఁటులు గుంపు గూడి పాడఁ దొడంగె
నిక్షుసాయకుఁడు విల్లెక్కు డించెఁ
జక్రవాకముల కవక్ర తేజము మించె
నలచకోరములకు నాస తలఁగెఁ
గొంకుచేఁ జీఁకటి గుహలందుఁ జొచ్చెను
నలుదిక్కులం దోఁగెఁ దెలుపు మించె.
నళుకుఁ గల్గెను జారచోరులకు నె దల
వృక్షములు వాసి పక్షులు వెడలి పాఱె
శిష్యులకు వేదబుక్కులు సెప్పఁ బూని
రోర్పుమై విప్రు లంతటఁ దూర్పునందు. 95

తే. దంభవృత్తి సురద్విషు ల్తాపసులను
హింససేయుటఁ గాంచి స హింప లేక

తచ్ఛిరంబులఁ దెగటార్పఁ దానవారి
పంచెనో చక్రమనఁ బుట్టెఁ భానుఁ డెలమి. 60

వ. అంతఁ దత్సమయోచితక్రియాశీలు రై వచ్చిరాజకుమారువరేణ్యుల
మూల్యాభరణాంబరంబులు దాల్చి వివిధవిచిత్రాలంకృతస్వయంవర
మంటపంబునకుం జని యుచితాసనంబులం గూర్చుండి రాసమయం
బున. 61

చారుమతిని చెలు లలంకృతురాలుగఁ జేయుట.

క. పొలఁతులు సంపెఁగనూనెం
బొలుపుగ రాసుతకు నంటెఁ పూనీట ముదం
బలరఁగ మజ్జన మొనరిచి
యలసట వ్రా విసరి తావిఁ యగుధూమంబున్. 62

ఆ. గుబులుకొనఁగ నిడుదఁకురులకు నొసఁగి చి
క్కనువు మీఱఁ దీసిఁ యారఁ జేసి
శర్కరామృతంబుఁజయ్యనఁ గ్రోలంగ
నొసఁగి రంతఁ జెలులుఁ మసలకుండ. 63

సీ. పస మించుచెంగావిఁవలువఁ బొల్పుగఁదాల్చి
కస్తూరి నెఱిఁ దిలకంబు వెట్టి
క్రొమ్మెఱుంగులు మీఱఁగూర్చినబంజుల
కమ్మలు వీనులఁ గ్రాలఁ జేసి
బెడఁగారుసొమ్ములుఁజడఁ బొంకముగ నిడి
జిగి మానికంబులఁ జెలఁగుతళ్కు
ముంగరఁ దగఁ బెట్టిఁమురు వగుచంద్రహా
రములుభూషలు కంధరమునఁ బూన్చి
కరయుగంబుల రత్నకంకణము లొప్పఁ
జేసి నడుమున మిసిమిగఁ జెలువు గూర్చి
డాలు మించెడురవలయొడ్డాణ మొసఁగ
నిడి పదంబుల కందెలుఁదొడిగి యంత. 64

చ. సురభిసుమైకమాలికలఁ జొప్పడ వేణి నలంకరించి భా
సురముగ మేనఁ జందనముఁ సొంపుగఁ బూసి కరంబునందు సుం
దరతరమల్లికాకుసుమదాము మొసంగిరి యప్ప డొక్క సుం
దరి నృపునాజ్ఞఁ గైకొని ముదంబెసలారఁగ వచ్చి రాసుతన్. 65

తరళవృత్తము. కని స్వయంవరమంటపంబునఁ గాంతరో నినుఁ గోరి వ
చ్చిననరేంద్రులు లేచి నా రని చెచ్చెరం జనుదెంచి తో
డ్కొనుచు ర మ్మనియెన్ భవజ్జనకుం డనంగఁ బ్రియాంగనల్
దనుఁ గెలంకులఁ గొల్వఁగా నెడఁదం బ్రమోదము నొందుచున్.

వ. అస్వయంవరమండపంబునకుం జన నారాజకుమారులు పొడగాంచి
యి ట్లనికొనిరి. 67

తే. శంబరాసురరిపుహస్త సాయకంబొ
నవసుధాంశునిరేఖయొ వివిధరత్న
ఖచితచిత్రంబొ రతిచేతఁ గ్రాలుశుకమొ
వరజయంతునిపట్టపు వారణంబొ. 68

క. జలజాకరమునకుం జను
కలహంసయొ లేక కమల గర్భుం డిలఁ జె
న్నలరఁగ బసిండిబ్రొమ్మఁ
గులఁ బడఁగం జేసె నేమొ కో యనుచుండన్. 69

తే. రాజచంద్రులఁ జూపఁగఁ రాజునాజ్ఞఁ
గొని పురోహితుఁ డాతేని కూఁతుతోడ
నాస్వయంవరమంటప మందు నిలిచె
వివిధమంగళవాద్యముల్ వేడ్కఁ జెలఁగ. 70

## చారుమతీస్వయంవరమహోత్సవము.

వ. అయ్యవసరంబునం బురోహితోత్తముండు చారుమతి కాయాయి
దేశాధిపతు లని వచ్చినరాజకుమారుల నిమ్మెయిం జూపఁ దొడంగె.

సీ. అమ్మరో చూడు మీయన గౌళనాయకుం
డతఁడు బంగాళదేశాధినాథుఁ

డితఁడు కోసలవిభుం డతఁడు పాంచాలేశుఁ
డితఁడుమాళవధవుం డతఁడు మత్స్య
వల్లభుం డితఁడు సాల్వమహీశుఁ డాతఁడాం
ధ్రధవుండె యితఁడు కేరళనరేంద్రుఁ
డతఁడు కాశ్మీరదేశాధిపు డితఁడు ఘూ
ర్జరనాథుఁ డతఁడుమగధధరణీంద్రుఁ
డితఁడు కొంకణరాజేంద్రుఁ డతడు బాహ్లి
కాధిపతి యాతఁ డుత్కళనాథుఁ డతఁడు
శకధరిత్రీశుఁ డితఁడు వత్సపతి మఱియు
నతఁడు సౌరాష్ట్రభూపాలుఁ డంచు నెలమి. 72

వ. సకలరాజన్యకుమారవరేణ్యులం జూపుచుం బోవ నొక్కెడ నుడు
గణంబున నుడురాజుంబోలె నాదిత్యులయందు విష్ణుకైవడిం బరిఢవి
ల్లుసాత్యవతేయుని నితఁడు మగధభూపాలుం డని వచింపఁ జారుమతి
మోహానవల్లిముఖం బాలోకింప నది కనుసైగ సేయ నించుక యా
తనిముఖారవిందంబుం గాంచి తనమనంబున. 73

క. మనసిజుఁడు రూపవంతుం
డని చెప్పుట కాని కన్నులారఁగ వానిం
గనుఁగొన్నవారు లే రిలఁ
గనుఁగొంటిని నేఁడుశంభుకరుణం గనులన్. 74

మ. తొలి నేఁ జేసినపున్నె మౌర యని సంతోషాత్మయై యెల్లరా
జులుఁ జూడం దనచేతిపూసరము తత్సూర్యాత్మజస్కంధమం
దలరం బెట్టెను దూర్యనాదములఁ గర్ణానంద మొందంగ ము
న్నలవైదర్భులయట్లు దేవతలు నాకనారీతులన్ మెచ్చఁగన్. 75

క. అత్తఱిసాత్యవతేయుం
డత్తరుణీమణికరాబ్జమతిసంతోషా
యత్తాత్ముఁడగుచుఁ బట్టె నృ
పోత్తము లెసఁ జూడఁ దోడియువతులు పొగడన్. 76

ఉత్సాహము. అంత రాజపుత్త్రి లెల్ల | రాస్వయంవరంబు న
త్యంతప్రీతిఁ జూచి యూర | కాశచే నిటుండ న
క్కాంత మనలఁ గోరునే యిఁ | కంద తేఁగు టుత్తమం
బింత కీశుకరుణ దాని | కెగ్గు సేయఁ బాడియే. 77

తే. అనుచుఁ దమపట్టణములకు | నరదములను
గూరుచుండియుఁ నేఁగిరిఁ | గూర్మి నెగడ
చారుమతి వెంటఁ దోడ్కొని | సంవి నత్త
హామయదుగుల కెఱగి స | మ్మదము మీఱ. 78

వ. సాత్యవతేయుండు నిజపురంబునకుఁ బ్రయాణంబు సేయఁ గని కళింగ
భూవిభుం డిట్లనియె. 79

క. విను మయ్యా విధ్యుక్తము
గను బెండిలి సేసి మిమ్ముఁ | గడు వేడుకన్నైఁ
బనుపంగ నుచిత మని తా
ఘనతఁ బురోధఃప్రపూర్వ | కంబుగ నెలమిన్. 80

సాత్యవతేయుండు చారుమతిని వివాహంబు చేసికొనుట.

వ. శుభముహూర్తం బొకండు నిశ్చయించి తల్లగ్నంబునకు స్వబాంధు
మిత్రజనంబులను జామాతృమాతామహీ మాతామహాదిప్రియజనం
బులను రావించి సంగీతవాద్యంబు లొప్ప రమణీయకల్యాణమంట
పంబునం గనకరత్నమయపీఠియందుఁ గూఁతు నల్లునిఁ గూర్చుండఁ
జేసి నపుడు సుగంధతైలంబున నంగనామణులు నలుఁగులు పాడు
చు శిరంబుల నంటి మంగళస్నానంబు సేయించి రంత. 81

ఆ. ఆకళింగనరవ | రాగ్రేసరుఁడు పుత్త్రి
కొసఁగు వస్త్రభూష | లొక్కపసిఁడి
పళ్లెరంబునందు | ఫలపుష్ప తాంబూల
చందనాదు లుంచి | యంద మలరు. 82

వ. భూషణాంబరంబు లొక్కపళ్లెరంబున జామాత కొసంగ నిడికొని
కల్యాణమంటపంబునకు యోషిద్రత్నంబుల చే నెత్తించుకొని వచ్చి
పురోహితులకడం బెట్టించె నయ్యవసరంబున. 83

క. చారుమతీసతికి నలం
కారంబును జేసి చెలిమిఁ గాంతలు తద్ధా
త్రీరమణుఁ డమ్మెయి శృం
గారంబును జేకొని యొఁ గౌతుక మెసఁగన్. 84

మత్తకోకిలము.

భూసురేంద్రులు బంధుమిత్రులు భూమిపాలురు మెచ్చఁగా
నాసమైఁ బురకాంతలెల్ల మహాద్భుతంబుగఁ జూడఁగాఁ
భాసురాంబురుహాక్షు లందఱు పాట లింపుగఁ బాడఁగా
వాసి మీఱుసుగీతవాద్యరవంబు దిక్కులు నిండఁగన్. 85

వ. ఉండుసమయంబునఁ బురోహితోత్తముండు మంగళాష్టకంబులు సె
ప్పుచు నాచారుమతీసాత్యవతేయుల నక్కల్యాణమంటపంబునకుఁదో
డ్కొని వచ్చి నవరత్నఖచితవిశాలపీఠిం గూర్చుండఁజేసి విధ్యుక్త
కర్మకలాపంబు లొనరించి చారుమతీకంధరంబున నిడుమని సా
త్యవతేయునికరంబునం జారురత్నాంచితమంగళసూత్రం బొసంగ న
తండు. 86

క. అంగభవారిని నిజజన
నిం గమలాప్తుని బుధాళినిం జిత్తమునం
దుం గడుభక్తిఁ దలంచి సు
మంగళసూత్రంబు గట్టె మంగళమలరన్. 87

వ. అనంతరంబ. 88

తే. చెలఁగి భూసురవర్యు లాశీర్వదింప
వందిమాగధు లానందమొంది పొగడ

నతివ లానంద మానందమాయె నంచుఁ
బాఁడుచుండఁగ నొగిఁ దలఁబ్రాలు పోసె. 89

తే. అంతనాదంపతులఁ బీఠియందు నుంచి
యగ్నిఁ బూజించి లాజహోమాదు లెల్ల
సరవిఁ జేయించె నవ్వధూవరుల కెలమి
బంధుమిత్రములు భూషణాంబరము లపుడు. 90

మత్తకోకిలము. కానుక ల్గొని వచ్చి యిచ్చిరి గౌరవం బలరంగ భూ
జాని యప్పుడు గూఁతు నల్లుని సంతసంబునఁ గాంచి నా
మానసాబ్జమునందుఁ గోరెన మాడ్కిఁ గూఁతున కిట్టి సం
ధానముం దగెఁ బో నిఁకేమి కృతార్థుఁడైతి నటంచుఁ దాన్. 91

వ. వివాహదినంబులయందు హర్షోత్కటస్వాంతంబున సకలజనంబుల
ను మృష్టాన్నంబునం దనిపి యనంతరంబు ప్రియంబుగ బంధుమిత్ర
పురోహితామాత్యావనీసురవందిమాగధాదిజనంబులకు నుచితవస్త్రా
లంకారాదు లొసంగి వారిం బంచి దుహితృజామాతలం గొన్నిది
నంబు లింట నుంచుకొని యొకసులగ్నంబున నవ్వధూవరులం బ్ర
యాణంబు సేయించి యాదినంబున. 92

తే. సద్గజాశ్వశతాంగముల్ సాధుగోస
హస్రమును సుందరాభరణాంబరములు
నొసఁగె జామాత కతఁడు సంతసము నొంది
వానిఁ గైకొని యతిభక్తి వఱలనపుడు. 93

వ. అత్తమామలయడుగుఁదమ్ములకుం బత్నీసమేతుఁడై దండప్రణామం
బు లాచరించి వారిశుభాశీర్వచనంబులం గొని నిజపురంబునకుం బో
వునవసరంబునం జారుమతిం జూచి తజ్జననీజనకు లిట్లనిరి. 94

చారుమతికిఁ దలిదండ్రులు నీతులు గఱపుట.

మత్తకోకిలము. అమ్మరో నిరతమ్ము భర్తపదాంబుజమ్ములు భక్తిఁజి
త్తమ్మునం దిడు వేఱదైవము ధాత్రి లేదిఁక నమ్ము స

త్యమ్మునఁ దప్పకుఁ బెద్దవారల నర్థిఁ జూడు మొకింత కో
పమ్మునైనఁ బరుషంబు లాడకు భక్తిఁ బాయకు మేలగున్. 95

చ. మనకు సమాన లెవ్వ రని మానసమందుఁ దలంపఁ బోకు ని
ర్ధనికుల గేలి సల్పకుము దార్కొని దూఱకు భృత్యవర్గముం
బని చెడి యేఁగ రా దొరుల ప్రార్థనకుం బతిఁ బాసి యొంటిగాఁ
గనకుము సుందరాంగు లని కన్నులఁ బూరుషులం గుమారికా. 98

ఉ. వచ్చినబంధుమిత్రులను వంచన సేయక యన్నపానముల్
పొచ్చెము లేక పెట్టు కృప పొంపిరివోవఁగ నంగహీనులం
గ్రచ్చఱఁ జేరి లే దనక రాతిరివేళలఁగాని యోగిరం
బిచ్చుట మంచి దమ్మ విను మెప్పుడుఁ బొందకు దానమందెదన్. 97

తే. వ్రతము లేవేని పతియాన వదలి సేయ
ఫలము లే దందుఁ బతియానఁ దలఁగకుండు
పతినిఁ బూజింప నదె మహావ్రతము దాని
కంటె లేమల కొకగతి గలదె జగతి. 98

క. పురుషునిసుఖదుఃఖంబులు
పరికించి తదానుగుణ్యపథమున నొగిఁ బొ
మ్మొరులకుఁ గీడెంచకు స
చ్చరితలతోఁ బల్కు పుణ్యసాధన మబలా. 99

ఆ. లేనివస్తువుఁ దెమ్మని లేనిపోని
మాటలాడుచు భర్తను మానభంగ
కార్యములఁ ద్రోసి నవ్వెడు కాంత లుండు
నెడకుఁ జనకుము పతిభక్తి విడిచి యెపుడు. 100

చ. అనిసుగుణంబులం దనయ కాత్మ నెసంగఁ బొసంగఁ జెప్పి యి
ట్లని రనురక్తి నల్లునకు నయ్య మదీయకుమారి కష్టముం
గన దిదియొంతమాత్రమును గావున నిప్పటిప్రీతి డెందమం
దొనరఁగ నెప్డు నుంపుము మృదూక్తులు పల్కుచు భద్రమయ్యెడున్.

తే. సకలదుర్గాభీతరణంబు సకలధర్మ
ములకు మూలంబు నిత్యసమ్మోదకరము
కీర్తిసంధాయకంబు రోగార్తినివహ
నిగ్రహము సాధుపత్నీపరిగ్రహంబు. 102

వ. కావున నిద్ధర్మంబునుం గూర్చి పెక్కులు వక్కాణింప నేల యనవుడు నాసాత్యవతేయుండు విని యతులకుత్తమవచనంబులం జెప్పి పరివారంబుతో నిజపురంబునకుం జని భార్యయుం దానుఁ దనవారికిం బ్రియం బారం బ్రణమిల్లి వారియాశీర్వచనంబులం గొని చారుమతిం గూడి సుఖంబుండె నంత నొకనాఁడు మాతామహుం డగు చంద్రగుప్తుండు సంసారవిముఖుం డగుచు సాత్యవతేయునకుఁ బట్టాభిషేకంబు సేయం బూని పురోహితపురస్సరంబుగా నొకముహూర్తంబు నిర్ణయించి సకలరాజన్యుల కెఱింగించి చిత్రకారుల రావించి. 193

చంద్రగుప్తుఁడు సాత్యవతేయునకుఁ బట్టాభిషేకము సేయుట.

సీ. పురవీథులందు సుందరముగఁ బచ్చని
పందిరు ల్వేయించి పలుతెఱంగు
లగుచిత్రవస్త్రంబు లొగి దాని కలరంగ
గట్టించి ముత్యాల పట్టుకుచ్చు
లెసఁగుతోరణములఁ బొసఁగ సింగారించి
చిత్రపటంబులు చెలఁగుపెక్కి
యంబులు రాజసౌధాగ్రంబులం దొప్పఁ
బెట్టించి యందందు బిరుదపటము
లరయ నిడఁ జేసి రాజచిహ్నములు దనరు
మకరతోరణములు సభామంటపమున
వఱల నెలకొల్పి ప్రతిగృహద్వారమునను
వివిధఫలపుష్పగుచ్ఛములు వ్రేలయునట్టి. 104

వ. కదళికాస్తంభంబు లొప్పార నిల్పి భూప్రదేశం బాతయుం గురంగనా
భఘనసారఘుసృణసంకలితహిమాంబువులకలయంపిఁ జల్లించి పలు
వింత లగురంగులు చెలంగురంగవల్లికలం దీర్పించె ననంతరంబ. 105

తే. సకలరాజన్యులను బంధునికరములను
హితులఁ బ్రెగ్గడలను బురోహితుల నెల్ల
గరిమ రావించి యాసులగ్నంబునందు
నృత్యసంగీతవాద్యంబు లెసఁగ నపుడు. 196

వ. చారుమతీసాత్యవతేయులకు మంగళస్నానంబు సేయించి సకలభూష
ణాంబరాలంకృతులం గావించి కల్యాణమంటపంబునం గాంచనపీఠం
బునఁ గూర్చుండఁ జేసె నప్పుడు పురోహితుండు తండులపూర్ణపా
త్రంబునఁ గనకకలశంబు లుంచి సముద్రోదకంబును నవరత్నధాన్యం
బులను దత్కలశంబుల నిడి పంచపల్లవంబులును బీతాంబరంబులు
ను నారికేళంబు నందుంచి యలంకరించి పుణ్యాహవాచనాదిపావన
మంత్రంబులం జెప్పి తద్విధ్యుక్తకర్మకలాపంబు లెల్ల నడపి నవరత్న
కిరీటంబును బూజింపఁ జేసి సర్వరాజన్యవైశ్యశూద్రమిత్రామాత్య
పురజనబృందంబు లానందంబునం జూడ నిరుగెడలం బాలంతులు కర
కంకణంబులు మొరయ వింజామరంబులు వైవ వందిమాగధులు
బ్రగడ నవనీసురోత్తములు ప్రవిమలవేదమంత్రాక్షతపుష్పంబులం
జేకొని యాశీర్వదింపఁ దత్కలశోదకంబును శిరంబునం జల్లి క్రమ్మఱ
నూతనవస్త్రాదికాల నలంకృతులం జేయించి రత్నసింహాసనంబునం
గూర్చుండఁ బెట్టె నప్పుడు చంద్రగుప్తమహారాజచంద్రుండు పుణ్య
వతీసమేతుం డై యొకపార్శ్వంబునను గాంభోజమహీపాలుం డగు
భద్రసేనుండు భానుమతీయుక్తుం డై యొకపార్శ్వంబునను నిల్చి సా
త్యవతేయునిశిరంబునం గిరీటంబు నిడి తమకరంబుల రాజ్యధురంధ
రం బగునంగుళీయకంబు లొసంగి శ్వేతచ్ఛత్రఖడ్గంబు లిచ్చి రనం
తరంబ. 107

తే. చంద్రగుప్తమహీశుండు సంతసమున
విప్రులను బంధుమిత్రుల వినయ మారఁ
బసదనంబు లొసంగి తాఁ బంపె నాఁటఁ
గోలె సాత్యవతేయుండు కువలయంబు. 108

గీ. అలర నేలుచుండె నాయేలుబడిఁ జూచి
సంతసంబు నొంది చారుమతికి
బుద్ధి సెప్పి మేము పోయి సిద్ధేశుని
గూర్చి సేవచేసి కొనుచు భక్తి. 109

వ. పాతాళఝరంబున నొక్కెడ. "వార్ధకే మునివృత్తీనా" మను సూక్తిచొప్పున వృద్ధు లగుమేము మునివృత్తి నుండెద మనిన విని భానుమతీభద్రసేను లమ్మోయిం బోవ నిశ్చయించి యంద ఱానందంబునం జారుమతీసాత్యవతేయుల దీవించి పాతాళఝరంబునకుం బోయి యం దొకయుచితస్థానంబునం జేరి క్రమంబున న య్యాశుపదారవిందభజనంబు సేయుటం జేసి తత్పరత్వంబున నన్నపానంబులు సరకు గొనక దేహంబులు మఱచియుండి పర్యవసానంబున నాసిద్ధేశ్వరచరణారవిందంబులం జేరిరి గావున.

సీ. పరమేశుఁ బూజించు కరములుకరములు
శితికంఠు వర్ణించు జిహ్వ జిహ్వ
కామారిఁ జూచెడు కన్నులు కన్నులు
భవుకథ లాలించు చెవులు చెవులు
శ్రీహరుఁ గోరెడు చిత్తంబు చిత్తంబు
శ్రీశంభునకు మ్రొక్కు శిరము శిరము
భర్గుని వలగొన్న పదములు పదములు
శంకరు జపియించు జపము జపము
దేవదేవుని సేవించు దినము దినము